శ్రీ రామ

# నీతి దీపావళి

[ చిన్న కథలు ]

(చతుర్థఖండము)



ప్రకాశకులు

రెడ్డి సోదరులు

రాయవరము, తూర్పుగోదావరిజిల్లా.

బ్రాంచి:—రాజమండ్రి

శ్రీ రామ

# నీతి దీపావళి

[ చిన్న కథలు ]

(చతుర్థ ఖండము)

గ్రంథకర్త


భాగవతుల లక్ష్మీపతిశాస్త్రిగారు





ప్రకాశకులు

రెడ్డి సోదరులు

రాయవరము, తూర్పుగోదావరిజిల్లా.

బ్రాంచి:—రాజమండ్రి

శ్రీ మేరీముద్రాక్షరశాలయందు ముద్రితము

1933




[వెల 5 అణాలు

# వి ష య సూ చి క




| | |
|---|---|
| మొదటి దీపము— దిలీపమహారాజు | 1 |
| రెండవ దీపము— నాభానేదిష్ఠుఁడు | 15 |
| మూఁడవ దీపము— ధర్మరాజు—యక్షుఁడు | 20 |
| నాలుగవ దీపము— లోభి | 32 |
| ఐదవ దీపము— భీష్ముఁడు | 37 |
| ఆఱవ దీపము— దుర్యోధనుఁడు—ధృతరాష్ట్రుఁడు | 58 |




శ్రీరామ

# నీతి దీపావళి



## చతుర్థ ఖండము



—( మొదటి దీపము )—

## దిలీప మహారాజు

పూర్వము వైవస్వతమనువు యొక్క వంశమునందు దిలీపుఁడను మహారాజొకఁడు పుట్టెను. ఆయన మగధ దేశ రాజపుత్రిక యగు సుదక్షిణాదేవిని పెండ్లియాడెను. ఆ ప్రభువు సరయూనదీతీర మందలి యయోధ్యానగరమును రాజధానిగఁ జేసికొని రాజనీతిని దప్పక ప్రజలను కన్నబిడ్డలవలెఁ బాలించుచుండెను. ఆయన కెన్ని భాగ్యము లున్నను సంతతి లేకపోవుటచే నవి యెల్లను వ్యర్థములైన వనియే భావించెను.

అందుచే సంతతి నిచ్చు వ్రతము నాచరించుటకై తన కులగురువు లగు వసిష్ఠులవారి యాశ్రమమునకు భార్యతో

డను స్వల్ప మగు పరివారము తోడను బయనమయ్యెను. వా రరణ్యమార్గమును బట్టి పోవునపుడు గొల్లపల్లెలలో నుండు వార లప్పుడే వెన్న కాచి చేసిన నేయిని కానుకగా నిచ్చుచుండిరి. ఆ మహారాజును వారల నా యరణ్యము నందలి వృక్షముల యొక్క పేరుల నడిగి తెలిసికొను చును, నందందుఁ గానవచ్చెడి యరణ్యము నందలి వింతలను జూచుచును సాయంకాల మగునప్పటికి వసిష్ఠులవారి యాశ్ర మమునకుఁ జేరెను.

ఆ మహర్షి యొక్క జపహోమాదు లగు నంతవఱ కును గనిపెట్టుకొని యుండి యా మహర్షిని దర్శించిరి. ఆ సుదక్షిణాదిలీపు లరుంధతీ వసిష్ఠుల పాదములను బట్టుకొని మ్రొక్కిరి. పరమపూజ్యులగు వారలకు మ్రొక్కవలసిన పద్ధతి యిదియే కదా? వార లా రాజ దంపతులను బాగుగా దీవించిరి.

అంతఁ గొంత మార్గాయాసము దీర్చుకొన్న తర్వాత వసిష్ఠుఁడు "మహారాజా! నీ రాజ్యమునందుఁ గుశలమే కదా!" అని యడిగెను. అందుకా క్షత్రోత్తముఁడు "కులపతు లగు తమ యనుగ్రహము చేతనే ప్రజలు చోరాది భయ ములు లేకయు నీతిబాధలు లేకయు స్వేచ్ఛ జీవించు చున్నారు! అట్టి తమ యనుగ్రహముచే నెన్ని యున్నను మా కోడ లగు నీ సుదక్షిణాయందుఁ బుత్రుఁడు పుట్టకుండుట

వలన నా కెంతమాత్రమును సంతుష్టి లేక యున్నది. తపస్సు దానము మొదలగు పుణ్యకార్యములచే బరలోకసుఖము మాత్రమే కలుగునని పెద్దలు చెప్పుదురు. మంచి పుత్రుడో యిహలోక సుఖమునే కాక పరలోకసుఖమును గలిగింపం గలడు. ఆ మాట యెట్లున్నను బుత్రుడు పుట్టకున్నం బితరుల ఋణమును దీర్పం జాలని వాడ నగుదును గదా! కావున మాకా పుత్రమహాభాగ్య మెట్లు కలుగునో తామ సెలవీయవలయును" అనెను.

అంత వసిష్ఠుండు కొంచె మాలోచించి యా మహారాజుతో "ఓ మహారాజా! నీకు సంతానము కలుగకపోవుటకొక కారణ మున్నది:—నీ వొకప్పుడు కామధేనువు నవమానించితివి. అది కోపించి సంతానము కలుగకుండు నట్లు శపించినది. పూజింపవలసిన వారిని బూజింపక యవమానింతు మేని కావలసిన కోర్కెలు ఫలింపవు! కావున నీకిప్పుడా కామధేనువును సేవింప వలను గాదు! దాని పుత్రిక యగు నందినీధేనువును శుద్ధచిత్తుండవై భక్తిసమేతముగాం బూజింపుము. అది యెట్టి వాంఛితమును నెఱవేర్పంగలదు" అను నంతలో నా నందినీధేనువు మేతకై యరణ్యమునకుం బోయి యాశ్రమమునకు "అంబా!" యని యఱచుచుం బరుగిడుచు వచ్చినది. ఆ లేంగటి యావునకుం గడుపునిండి పొదుగుండుట వలనం బాలు నేలం గాఱుచుండెను. దాని పాద

ధూళి తగులుటచేఁ బవిత్రుఁడ నైనాఁడ నని యా మహారాజు తలఁచెను.

ఆహా! గోవు లెంత పవిత్రము లైన జంతువులు! మన పూర్వులు గోవుల పాదధూళి తగిలినఁ బావనుల మైతి మని యెంచెడి వారలు కదా! ఇప్పటికి వలె నావులు పాలిచ్చి నన్ని దినములు వాసి పాలు బాగుగాఁ ద్రాగి పట్టిపోయిన పిదప ద్రవ్యమున కాశించి కటికివాని కమ్మివేయు దురాచార మప్పుడు లేదు! మఱియు నుక పెద్ద లేపనికైనను బోవలసి వచ్చినపుడు గోధూళి [illegible] వెడలెడి వేళను బయలుదేఱి పోయి వారల కార్యములు సాఫల్యమగునట్లు చేసికొనెడి వారలు.

అంత నా వసిష్ఠుఁ డా మహారాజుతో 'ఓ పార్థివేంద్ర! అభ్యాసనముచేతనే విద్యల నలవాటు చేసికొను విధముగా నీ వి గోవు వెంటఁ బోయి కాచుచుండుము! దీనిని నీ వేమాత్రమును బాధింపరాదు! ఇది నడచుచున్నపుడు నీవును నడచుచుండుము! ఇది నిలిచినపుడు నీవును నిలువుము! కూర్చున్నపుడు నీవును గూర్చుండుము! ఇది నీళ్లు త్రాగునపుడు నీవును నీళ్లు త్రాగుము! ఇక నీ భార్యయును ప్రాతఃకాలమున గంధ మాల్యాదులతోఁ బూజించుచుండవలయును. ఇది మేఁత కరణ్యమునకుఁ బోవునపుడు మా యాశ్రమము దాఁటిపోవు వఱకును వెంబడించి పోవుచుండవలయును. మరల సాయం

కాలమునం దెగు రేఁగి తోడి తెచ్చుచుండవలయును. ఈ విధముగా నీ నందినీధేనువున కనుగ్రహము కలుగువఱకును నానక్తివేళ సేవింపవలయును" అని మునీశ్వరుఁడు చెప్ప దేశకాలజ్ఞుఁ డగు నా ప్రభువర్యుఁడును నట్లేయని సమ్మతించెను.

అంత నా రాత్రి కొంత గడచుటచేఁ బోయి నిదురింపుటకై రాజున కాజ్ఞ యిచ్చెను! ఆ రాజచంద్రుఁడును వసిష్ఠులవారు తా మింపుటకై నిర్దేశించిన పర్ణశాలకుఁ బోయి నిద్రించెను. విద్యార్థులు వేఁగుజామున లేచి తమ పాఠములను జదువుకొనవలయు గావున వసిష్ఠులవారి శిష్యులు తెల్లవాఱుజామున వేదములను జదువుచుండుటవలన రాజునకు మెలకువ వచ్చినది.

గురువులువారు చెప్పినట్లా నందినీధేనువునకుఁ బ్రాతఃకాలమునఁ దన భార్యచేఁ బూజచేయించెను; దూడను బాలు గుడిపించి కట్టివైచెను. అంత మేఁతకై యడవిలోనికిఁ బోవ విడిచెను. ఆశ్రమము దాఁటువఱకును సుదక్షిణాదేవియు నాయావును వెంటనంటిపోయెను. ఆ పార్థివుఁ డట్లా గోవు వెంట నరణ్యమునకుఁ బోవునపుడు తా నొక్కఁడే పోయెను. క్షత్త్రియులు తమ పరాక్రమము చేతనే కదా తమ్ముఁ గాపాడుకొందురు.

బాలకులారా! ఆ దిలీపమహారాజు నందినీధేనువున కెట్లు సేవ కావించెనో తెలిసికొనుఁడి! కట్టెళ్లకొలఁదిని రసవంతమైన పచ్చిగడ్డి పీఁకి దాని నోటి కందిచ్చుచుండెను. ఆవులను బాధించెడి యడవి యీఁగలను దానిపై వ్రాలనీయక తోలుచుండెను. దాని నిట్టునట్టు మరలింపక యది పోయినట్లె పోనిచ్చుచుండెను. అది నిలుచున్నపుడు తానును నిలుచుండును. అది నడచునపుడు తానును గూడ నడచును అది కూర్చుండునపుడు తానును గూడఁ గూర్చుండును. అది నీళ్లు త్రాగునపుడు తానును గూడ నీళ్లు త్రాగును. ఇంత యేల! దాని నీడవలెఁ దానిని వెంబడించి యుండెను. సాధారణముగా నరణ్యములం దుండు జంతువులు చేత విల్లు గల వాని జూచి పారిపోవుచుండును. ఆ మహారాజు మిక్కిలి దయకలవాఁ డగుటచే నాయన చేతను విల్లు గాన్పించుచున్నను మృగము లాయనను జూచి పారిపోవుటకు మారుగా నిలిచి చూచుచుండెడివి. లోకములో దుర్మార్గులను జూచిన భయము గలుగును; గాని సత్పురుషులను జూచిన భయ ముండునా!

అట్లా గోవును మేపుచుండఁగా సాయంకాల మైనది. ఆ గోవును దూడకై యఱచుచు నాశ్రమము లోనికి వచ్చుచుండెను. సుదక్షిణ దాని కెదురుగాఁ బోయి తోడితెచ్చెను. దానికిఁ బ్రదక్షిణ మొనరించెను; దాని నక్షతలతోఁ బూజిం

చెను. అట్లా భార్యాపతు లిద్దఱును నా నందినీధేనువున కిరువది యొకండు దినములు భక్తితో సేవ యొనర్చిరి.

అంతట నొక నాఁ డా నందినీధేనువున కా దిలీప మహారాజును బరీక్షింపవలయు నని బుద్ధి పుట్టినది. ఆ నందినీ ధేను వెప్పటి యట్ల మేఁతకై హిమాలయము చెంతకుఁ బోయినది.

అక్కడ నొకచోటను గంగానది కొండపైనుండి జాఱి క్రిందఁ బడుచుండెను. అందుచేతను బాగుగాఁ బెఱిగిన లేఁత పచ్చిక యొక చోటను గాన్పించినది. అది మేయుచు నా గో వొక గుహలోనికిఁ జొచ్చినది. ఆ దిలీపమహారాజా యావును వ్యాఘ్రములు లోనుగాఁగల క్రూరమృగము లేమియును జేయఁజాల వనెడి నమ్మకముతో క్షణకాల మా హిమాలయము యొక్క శోభను జూచుచుండెను.

అంతలో నాగోవు తన మహిమచేఁ దన్నొక సింహము పట్టుకొని బలాత్కారముగా నీడ్చుకొనిపోవు చున్నట్లుగాఁ గాన్పించినది. "అంబా" అని దిక్కులు మాఱుమ్రోఁగున ట్లఱచినది. ఆ దిలీపుఁ డా గోవునంకను జూచెను. అయ్యో! నే నెంత తప్పు చేసితిని; నిష్కారణముగా నా సింహము మునిగోవును లాగుకొని పోవుచున్నదే! ఇఁక నూరకుండరా దని త్వరపడుచు నా సింహమును జంపుటకై యొక బాణ మును దీయుటకుఁ దన కుడిచేతి నమ్ములపొదిలోఁ బెట్టెను.

అప్పు డేమని చెప్పుదును! దాని ప్రభావముచే నాతనిచేయి
యందుండి కదల్పలేకపోయెను. ఆ చేయి యట్లు కొయ్య
వాఱుటచే నా మహారాజునకు నత్యంత కోపము వచ్చినది.
మనువంశమునఁ బుట్టిన మహారాజులు సింహపరాక్రమము గల
వారలు. అందుచే నా మహారాజాశ్చర్యపడుచుండఁగా
మఱింత యాశ్చర్యము కలుగు లాగున నా సింహ మాయ
నతో "ఓ మహీపాలా! ఏల వ్యర్థముగా శ్రమపడెదవు?
నీ బాణము నా మీఁదఁ బ్రయోగించినను వ్యర్థమే యగును!
ఎందుచేతనందువా? దానికొక కథకలదు. చెప్పెదను వినుము:-
నే నొక శివసేవకుఁడను. నా పేరు కుంభోదరుఁడు. శంక
రుఁడు తన వాహనము నెక్కఁబోవు నపుడు నా వీఁపుపైఁ
దన కాలూని యెక్కును. మఱియు నిదిగో చూడుము!
ముం దొక దేవదారు వృక్షమున్నది. దీనిని పార్వతి తన
కొమరుఁ డగు కుమారస్వామిని పెంచునట్లుగాఁ బెంచు
చున్నది ఈ యడవి ముం దుండెడి యేనుఁగు లొకప్పుడు
చెక్కిళ్ల దురద తీరుటకై యీ చెట్టుబట్టను నొరసికొనినవి.
అందుచేత నీ చెట్టు పట్ట యూడిపోయినది. దానికిఁ బార్వతి
యెంతయో వగచినది. అప్పుడు పరమేశ్వరుఁడు దీనిని గాపా
డుటకై నన్నొక సింహముగా మార్చి యిందుఁ గాపుంచి
నాఁడు. నే నీ చెట్టుచెంతకుఁ జేరిన జంతువుల నెల్ల విడువక
కాఁ జేయుచుందును. కావున నీ వెంతమాత్రమును నాయాన

వనక మరలి పొమ్ము! నీవు చూపిన గురుభక్తి చాలును. శస్త్రములచే రక్షింపఁ జాలని దానిని శస్త్రములచే నెట్లు రక్షింపఁగలవు?

అప్పు డా దిలీపుఁడు మహాదేవుని ప్రభావము చేతనే తన బాహువులు స్తంభించిన వని తెలిసికొని తనకుఁ గలిగి నది యవమాన మని భావింపలేదు.

అంత నా సింహముతో "ఓ మృగేంద్రమా! ఈ విధముగా నేమియును జేయనేరకున్న నామాటలు నీకుఁ బరిహాసనీయములు గాఁదోఁచినను దోఁచ నిమ్ము! అట్లయ్యను నీవును జీవుల మనస్సులో నున్న యభిప్రాయము నెఱుఁగుదువు; గావునఁ గొంచెముగాఁ జెప్పుకొనుచున్నాఁడను:— లోకములు పుట్టించుచును బెంచుచును నాశముచేయుచును నున్న యా పరమేశ్వరుఁడు నాకును బూజ్యుఁడే! కాని కులగురువు లగు వసిష్ఠులవారి ధేను వీ విధముగా వధింపఁబడుచుండుటను జూచి యోర్వఁగలనా! ఎట్లయిన నేమి! ఇప్పుడు నీవు నీయాఁకలిని గదా తీర్చుకొనఁ జూచుచున్నాఁడవు. దయచేసి నా దేహమును భక్షించి నీ యాఁకలిని దీర్చుకొనుము! సాయంకాలము కాఁగానే "అంబా" అని యఱచుచు నాశ్రమమునందు లేఁగదూడ యంగలార్చుచుండును, మా గురువులును హోమధేనువునకై యెదురు చూచుచుందురు; కావున దానిని విడిచిపెట్టుము!" అనెను.

రాజ్య మేల? గీజ్య మేల? అప్పుడు చచ్చిన నేమి! చావ
కున్న నేమి! ఇతరము లైన కొన్ని పాడియావుల నిచ్చి సమా
ధాన పెట్టుటకు సాధ్యపడునా! గోవు లన్నియును పవిత్రము
లైనవియే; కాని యిది కామధేనువుకంటెను దక్కువ యైనది
కాదు. ఈశ్వరమహిమచేతనే దీని బట్టుకొనఁగలిగితివి
కాని లేకున్న దీని ముట్ట శక్యమగునా! ఎటులైనను నా
దేహమును సమర్పించి యీ యావును విడిపించుటయే న్యాయ్య
మైన పని. అందుచే నీ కాహారమును జెడఁగొట్టినవాఁడను
గాను; మునియొక్క హోమకార్యమును లోపింపఁజేసినవాఁ
డను గాను. ఇది నీకుఁ దెలియును ధర్మజ్ఞా! నీవు నొక
ప్రభుని గొలుచుచున్నవాఁడవు కదా! నీవీ దేవదారు వృక్ష
మును మహాప్రయత్నముతో రక్షించుచున్నవాఁడవు. రక్షింప
వలసిన దానిని నాశము కావించి బోయి మరల స్వామి
యెదుట నే ముఖముతో నిలువఁగలవు. కావున నా ప్రాణ
ముల నిచ్చి మా స్వామివారి ధేనువును రక్షించుటయు
న్యాయ్యము! ఒకవేళ నన్ను జంపరా దని తలంచెద వేమో!
అశాశ్వత మగు నీ శరీరమును బుచ్చుకొమ్ము. శాశ్వత మైన
నా యశశ్శరీరమును రక్షింపుము! నాకీ పాంచభౌతిక శరీ
రమునందపేక్ష యొంటిమాత్రమును లేదు! ఓ పంచాస్యమా!
మాటలాడుటయే స్నేహమునకుఁ గారణమని పెద్దలు చెప్పు
దురు. అది మన కిద్దఱకును నీ యడవిలోఁ గల్గెను. నీవు

స్నేహితుఁడ నగు నా ప్రార్థనమును భంగపఱచుట యుక్తము కాదు" అనెను.

ఆ మహారాజు మాటలకు సింగ మా నందినీధేనువును వదలిపెట్టెను.

అంత నా రాజచంద్రుని యొక్క బాహుస్తంభనము తీఱి స్వాధీనమయ్యెను. అప్పుడు తన యాయుధములను విడిచిపెట్టి మాంసపు ముద్ద వలెఁ దన శరీరమును నా హార్యక్షమున కప్పగించెను. తా నధోముఖుఁడై కూర్చుండి యా సింహము తనపై కుఱికి భక్షించుటకై ప్రతీక్షించు చుండెను. అప్పు డేమి చిత్రము జరిగియుండెనో మన మాలోచింపవలసి యున్నది.

ఆ సింహము వచ్చి యా మహారాజుపైఁ బడుటకు మాఱుగా నాకసమునుండి పూలవాన యా రాజసింహునిపైఁ బడినది. అంత "వత్సా! లెమ్ము" అను మాట యొకటి యాయన చెవులఁ బడినది. అప్పు డా దిలీపుఁడు లేచి చూడఁగాఁ దన యెదుటను దల్లివలెఁ బాలు చేపుచు నా నందిని ధేను వే యగపడెను. అందుల కాశ్చర్యపడుచు దిలీపుఁడు చూచుచుండెను.

ఆ నందినీధేనువు "ఓ సాధూ! నిన్ను బరీక్షించుటకై నేనే యీ మాయను గల్పించితిని. వసిష్ఠుల యొక్క ప్రభా

వనముచే నా చెంతకు యముఁడే చేరఁజాలఁడు! ఇఁకఁ గ్రూర వ్యాఘ్రముల మాటయా చెప్పవలెను.

మఱియు నీకు గురువుల యెడఁ జాల భక్తి కలదు నా యందును జాల దయ కలదు; కావున నిన్ను మెచ్చు కొంటిని! వర మడుగుము! ఇచ్చెదను; నన్ను పాలు మాత్రమే యిచ్చెడి యావుగాఁ దలంపకుము! కనికరము గలిగినఁ గోరిన కోఁకలనుగూడను గొనలుసాగింపఁ గలను" అనెను.

అంత దిలీపమహారాజు "అమ్మా! స్వహస్తార్జిత వీర శబ్దుఁడును, వంశకర్తయు, ననంతకీర్తియు నగు తనయుని సుదక్షిణాదేవియం దనుగ్రహింపుము!" అని చేతులు జోడించు కొని ప్రార్థించెను.

ఆ నందినియు "ఓ బిడ్డా! ఇప్పుడు నా పాల నొక యాకు దొప్పలోనికిఁ బిదికి త్రాగుము! నీ కోరిక చెల్లును" అనెను.

ఆ భూపతి "అమ్మా! దూడ త్రాగినపిదప హోమమునకు వినియుక్తము కాఁగా మిగిలెడి పాలను గురువులవారి యొక్కయు సెలవును బొంది త్రాగెదను" అనెను.

అంత సాయంకాల మగుటచే నా నందినీధేనువు వెంట నా తపోవనములోనికి భూపతియు వచ్చెను. అరణ్యమునందు జరిగిన సమాచార మెల్లను నా మహారాజు వసిష్ఠులకుఁ జెప్పెను.

ఆ గురువుల యనుమతి యైనపిదప దూడకును హోమ ధేనువకును నుపయోగపడఁగా మిగిలిన పాల నత్యాసక్తితోఁ ద్రాగెను.

వసిష్ఠుఁడు మఱునాఁడు గోసేవా పారణ మైన తరువాత నాశీర్వదించి స్వరాజధానికిఁ బోవ సుదక్షిణా దిలీపుల కనుజ్ఞ నిచ్చెను. వారలును నగ్నికిని మునికిని హోమ ధేనువునకును బ్రదక్షిణము కావించి నిజ రాజధానికిఁ బోయిరి.

అంత సుదక్షిణ గర్భవతియై యొక సుపుత్రుని గనెను. అతఁడే రఘుమహారాజు.

—: ప్రకాశము :—

“సద్వంశమున జనించిన ధీరులు ప్రాణముల నైనను గోల్పోవఁ జూతురు; కాని యుత్తమధర్మములను విడనాడఁ జూడరు. అందులకు దిలీపమహారాజు వృత్తమే గొప్ప సాక్ష్యము. మఱియుఁ బూర్వకాలము నుండియుఁ గోవులు పరమపవిత్రము లైన జంతువులుగా నెన్నఁబడుచున్నవి. అట్లు కాకున్న ప్రాయశ్చిత్తములందుఁ బంచగవ్యప్రాశనము చేయుదురా? వేయేల! మనుజునకుఁ గన్నతల్లి కొంతకాలము వఱకే పాలిచ్చి పెంచును. గోవులు మనుజుఁడు జీవించి యున్నంతకాలమును పాలిచ్చుచునే యుండును. అట్టి హితము చేయు జంతువులను గూలలనై కటికవాండ్ర కమ్ముచుట న్యాయ్యమైన పని కాదు

—(రెండవ దీపము)—

# నాభానేదిష్ఠుఁడు

పూర్వము బ్రహ్మపుత్రుఁ డగు మను వీ భూమినిఁ జాల కాలము బాగుగాఁ బాలించి తన పుత్రులయందు రాజ్యభార ముంచి గృహస్థాశ్రమమును వదలి వానప్రస్థుఁ డయ్యెను. మను ష్యులు బ్రహ్మచర్యము, గార్హస్థ్యము, వానప్రస్థము సన్న్యా సము ననెడి నాలు గాశ్రమములందుఁ గ్రమముగా వర్తింప వలయునని ధర్మశాస్త్రములు చెప్పుచున్నవి. ఆమనుపుత్రులలో నాభానేదిష్ఠుఁ డను వాఁడు తల్లిదండ్రులు చెప్పినట్లు విని చిన్న తనమునందే విద్యలను నేరుకొనవలయు నని యెంచి బ్రహ్మ చర్యముతోఁ గురుగృహమునందు విద్యలను జదువుకొను చుండెను.

ఇంటికడనున్న సహోదరు లందఱును "నాభానే దిష్ఠుఁ డిఁక మన యింటికి రాఁడు; అతఁడు బ్రహ్మచర్యవ్రత ముతోడనే గురుకులమం దుండును; వాని కేమాత్రమును మనము మన పిత్ర్యములో భాగ మీయనక్కఱలేదు" అని యెంచి యాతని కేమాత్రమును భాగమీయక కల ధన మంతయుఁ దక్కిన మనుపుత్రులే పంచుకొని యనుభవించుచుండిరి.

ఆ నాభానేదిష్ఠుఁడు గురుకులమం దుండి శ్రద్ధతో జదువుకొని పండితుఁ డయ్యెను.

అంతట గురువులువా రొకనాఁడు నాభానేదిష్ఠుని బిలిచి "పుత్రుఁడా! నీవు చదువుకొనిన విద్య చాలును! ఇఁక స్వగృహమునకుఁ బోయి గృహస్థుఁడ వగుము!" అని చెప్పెను.

ఆతఁడు గురువుల పాదములపైఁ బడి మ్రొక్కి సెలవు గైకొని వివాహము చేసికొనుటకై యింటికి వచ్చెను. వలసినంత ద్రవ్య మున్నను గాని వివాహ మాడుట యోగ్యమగు పని కాదు; కావున నా మనుపుత్రుఁడు సహోదరులను "నా భాగ మెందున్న ద" ని యడిగెను. వార లాతనిని వట్రపెట్టక "నీ భాగ మిం దెన్నటను లేదు! బ్రహ్మిష్ఠుఁడగు మన తండ్రియే నీ భాగము! ఆయన యిప్పు డరణ్యమునం దున్నాఁడు! ఆయనకడకుఁ జనుము" అనిరి.

ఆ మాట వినగానే నాభానేదిష్ఠుఁడు మిక్కిలి విచారపడుచు నారణ్యకవ్రత మాచరించు చున్న జనకునిదగ్గఱకుఁ జనియెను. భ్రాతల క్రౌర్య మంతయును విన్నవించెను.

అంతటఁ దండ్రి తనయునితో "నాయనా! విచారపడకుము! ధర్మమార్గమున వర్తించువారల కే లోపమును గలుగదు! నీ కొక యుపాయమును జెప్పెదను వినుము:—
అంగిరసు లనెడి ఋషులు స్వర్గమును గోరి సమీపమునందే యాగమును జేయుచున్నారు. వారల కా యజ్ఞమునం దాఱవదినమున నేమి చేయవలయునో తెలియక తికమకలాడు

దురు. వారల కడకుఁ బోయి యీ సూక్తద్వయమును నుపదేశింపుము! అందుచే వారల మఖము యథావిధిగా ముగించి స్వర్గమునకుఁ బోదురు. వారలు నీకుదీక్షాదక్షిణగా వేయి యావుల నిత్తురు" అని సూక్తద్వయము నుపదేశించెను.

అంతట నాభానేదిష్ఠుఁడు పట్టరాని సంతోషముతో నాయంగిరసు లున్న స్థలమునకుఁ జని వారలతో "ఓ యంగిరసులారా! నేను మనుపుత్త్రుఁడను; నాపేరు నాభానేదిష్ఠుఁడు! మీరొనర్చు యాగమునందు నన్నొక ఋత్విజునిగా వరింపుఁడి!" అనెను.

వార లా మనుపుత్త్రునితో "ఓ మనుపుత్రా! మే మొనర్చు జన్నమునందు నీ వేమి చేయఁగలవు?" అని యడిగిరి.

అతఁ డా యాంగిరసులతో "మీ రొనర్చెడి యాగమునందు ఆఱవనాఁడు చేయవలసిన కృత్య మెల్లను నుపదేశింపఁ గలను. మీ యాగము ముగియఁగా నవశిష్ట మగు మీ గోసహస్రమును నాకుఁ దక్షిణగా నొసఁగుఁడి!" అనెను.

అంతుల కంగీరసులును సమ్మతించిరి.

అంత యజ్ఞము చేయుచుండఁగా షష్ఠదివసము సంప్రాప్త మయ్యెను. నాభానేదిష్ఠుఁడు జనకోపదిష్ట మగు నా రెండుసూక్తములను వారలచేఁ జదివించెను. అందువలన వారి కా యజ్ఞపురుషుని యొక్క రూపము గోచరించెను. ఆ కారణముచే వారలు స్వర్గమునకు వెడలుచు నాభానే

శిష్యుని బిలిచి "మిగిలి యున్న యీ గోసహస్రమును నీకే! కైకొనుము" అని యొప్పగించిరి.

ఆ ప్రకారము మా గోధనమును దీసికొనిపోవ నున్నపు డుత్తరముగా నుండెడి వేది (అరుగు) పైనుండి నల్లని వస్త్రములను గట్టుకొని యున్న యొక పురుషుడు కానవచ్చెను. అతడు నాభానేదిష్ఠునితో "ఓ మానవా! ఈ గోధన మెల్ల నాదియే కాని నీది మాత్రము కాదు! పరధనమును ముట్టవచ్చునా! దూరముగా దొలగి పొమ్ము!" అని బిగ్గరగా నఱచి చెప్పెను.

ఆ మానవుడు "ఓ కృష్ణవస్త్రధారి! అంగిరసు లీ గోధనమును నాకిచ్చియుండగా నీదే యెట్లగును? నాదే యీ గోధనము!" అని బదులు చెప్పెను. అంతట నా పురుషుడు "ఓ మానవా! ఈ విషయమై మన యిరువురకును గల తగవును దీర్పజాలినవాడు నీ తండ్రియే! ఆయనకడకుం బోయి న్యాయమును దెలిసికొని రమ్ము!" అనెను.

ఆ మానవుడు ధర్మము ననువర్తించెడి స్వభావము గలవాడగుటచే దండ్రి చెంతకుం బోయెను. ఆయనకు జరిగిన సంగతి యెల్ల నెఱిగించెను.

అంత మనువు పుత్రునితో "నాయనా! శాస్త్రమును బట్టి చూచిన యజ్ఞమునకు నిజముగా నా గోధన మా పురుషునిదే! ఇందు వివాదమున కవసరము కాన్పించుటలేదు" అని నిర్ధారణచేసి చెప్పెను.

ఆతఁడు తత్‌క్షణమే యాకృష్ణవస్త్రధారి చెంతకుఁ
బోయి "ఓ మహాభాగ! ఈ గోధనమెల్ల నీదియే యని
మా తండ్రిగారు నిర్ధారణముగాఁ జెప్పెను; నీవే తీసికొని
పొమ్ము!" అని తనదానిని బట్టి పోవుచుండెను.

ఆ పురుషుఁడును నాభానేదిష్ఠుని గుణమునకు మెచ్చు
కొనుచు మరల నాతని వెనుకకుఁ బిలిచి "ఓ మానవా!
నీ సత్యవచనమునకు నాకెంతయు సంతసము కలుగుచున్నది.
ఇది యెల్ల నాది యయ్యును నీకే నే నిచ్చివేయుచున్నాఁడను;
జాగుచేయక తీసికొనిపొమ్ము!" అని యాతని కా పురుషుఁ
డా గోసహస్రము నిచ్చివేసెను.

—:ప్రకాశము:—

"మనకు ధర్మమైన పదార్థములనే కైకొనుచుండ వల
యును; గాని యధర్మమైన పదార్థముల నెంతమాత్రమును
గైకొనరాదు! సత్యవంతులకే భగవంతుఁడు సంపదలను గలి
గించుచుండును. అట్టి వారలకే భగవంతుఁడు తోడ్పడుచుం
డును; గావున సత్యమునే సదా పలుకుచుండవలయును.
మఱియు బాల్యమున విద్యాభ్యాసము చేయువలయును;
యౌవనమునఁ బ్రాపంచికసుఖము లనుభవింపవలయును; వార్ధ
కమున మౌనమును దాల్చి పరమేశ్వరుని ధ్యానించుచు నుండ
వలయును!"



—( మూఁడవ దినము )—

# ధర్మరాజు—యక్షుఁడు

పాండవులు ద్వైతవనమునం దున్నపు డొక బ్రాహ్మణుఁడు వచ్చి ధర్మరాజుతో "ధర్మరాజా! నే నగ్నిహోత్రమును బుట్టించుకొనెడి యరణి నొక చెట్టుకొమ్మకుఁ దగిల్చితిని. ఎక్కడనుండియో యొక మృగము వచ్చి యా చెట్టును రాచుకొనఁగా నా యరణి దానికొమ్ములకుఁ దగిలినది. అంత నది యందు నిలువక పరుగిడి పోవుచున్నది. ఆ యరణి లేకున్న నేను చేసికొనెడి నిత్యవిధానమునకు లోపము గలుగును. నీవు ధర్మాత్ముఁడవు! ఎట్లయినను దానిని శీఘ్రముగాఁ దెప్పించి నా కీవలయును" అనెను. అందులకు ధర్మతనూభవుఁడును దమ్ములును నా మృగమును వెంటనంటి పోవుచు నుగ్రబాణము లేసిరి. అదేమి మాయయో కాని నేర్పరు లగు వారలు వేయు బాణ మొక్కటి యైనను దానికిఁ దగులకపోవలయునా! అట్లా సోదరుల నైదుగుర నా మృగము దూరముగా లాగుకొని పోయి పోయి తుదకుఁ దానొక ఘోరారణ్యమున నదృశ్య మయ్యెను.

అంతఁ దమ యత్నము విఫల మయ్యె నని విషాద మందుచు నా సహోదరు లైదుగురు నొక్కచోటఁ జల్లని నీడ గల యొక చెట్టుక్రింద విశ్రమించిరి. లోకములోఁ బరోక

కార పరాయణు లాపగిదియే కదా పలు పాట్లు పడుచుండు దురు. అప్పుడు నకులుఁడు ధర్మరాజుతో "అన్నా! కులశీలాదులను గోల్పోయి యీ విధముగా మన మీ కానకమున దుఃఖపడుటకుఁ గారణ మేమై యుండును!" అనెను.

అత్తఱిఁ దమ్మునితో ధర్మజుఁడు "తమ్ముఁడా! లోకములోఁ బ్రతి మనుజునకును దాను పూర్వమునఁ జేసిన కర్మమే సుఖమునకుఁ గాని దుఃఖమునకుఁ గాని కారణమగుచుండును. అందుచేఁ బుణ్యకార్యము లొనర్చిన వారలు సౌఖ్యమును బాపకార్యము లొనర్చినవారలు దుఃఖమును ననుభవించుచుందురు. ఆ మాటకు భీముఁడు నకులునితో "తమ్ముఁడా! ధర్మనందనుఁడు మొదటినుండియు నట్టి ధర్మవచనములే పలుకుచుండెను. మన దుఃఖమునకుఁ గారణము పూర్వము కొలువులో ద్రౌపది నవమానించు నెడ దుర్మార్గులగు నా దుర్యోధనాదులను దునుమ కూరకుండుటయే! ఆ మాటను బట్టి యర్జునుఁడు నకులునితో "సోదరా! ఆ సభలో సూతసుతుఁ డగు కర్ణుఁడు పలికిన కాఱులు విని పిఱికివారి వలె సహించి యుంటి మి ట్లరణ్యముల పాలైయుండుటయే మన కిప్పుడు దుఃఖకారణమై యుండెను గాని వేఱొండు కాదు" అనెను. ఆ మాటకు సహదేవుఁడు "నకులా! మన మిట్లు కాననాంతములందు దుర్దశలపాలై యుండుటకుఁ గారణము దుర్వ్యాతపరుఁ డగు గాంధారుని బట్టి యీనాఁ

డాతని కండలు చెండాడకుండుటయే!" అని యెవరి మనమున నుండెడి క్రోధమును వారు వెలిపుచ్చుకొనిరి. అప్పుడు ధర్మనందనుఁడు నకులునితో "సోదరా! ఆ మాటల కేమి! ఇప్పుడు నీ సోదరులు మిక్కిలి దప్పిగొని యున్నారు. కావున నీ వృక్షముపై కెక్కి నీరుండు తావును జూడుము!" అనెను. అంత నన్న యానతి ప్రకారముగా నకులుఁ డా చెట్టుపై కెక్కి నలుదెసలు గలయఁ జూచి "అన్నా! అదిగో! ఇచ్చటికిఁ గొంచెము దూరములో జలములు గాన్పించుచున్నవి" అనెను. ఆ ధర్మరాజు "తమ్ముఁడా! అట్లయినపక్షమునకుఁ జెట్టుపైనుండి శీఘ్రముగా దిగి వచ్చి నీవే యచ్చటికిఁ బొమ్మా! తనివితీఱ నీరు త్రాగుము! మాకును గొంత జలమును దీసికొనిరమ్ము!" అనెను. అంత నకులుఁ డా చెట్టుపైనుండి దిగి వచ్చి యా తటాకమునకుఁ జని నీరు త్రాగఁబోవుచుండఁగా నొక యక్ష రీరభూతము "ఓ యన్నా! ఈ తటాకము నాయది. నిజముగా నీవీ తటాక జలములను ద్రాగ నెంతువేని ముందుగా నే నడిగెడి ప్రశ్నముల కుత్తరము లిచ్చి త్రాగవలయును" అనెను.

నకులుఁ డా మాటలను వట్ర పెట్టలేదు. ఆ కొలనిలోని దియ్యని నీరు ద్రాగి దాని యొద్దనునే నిశ్చేతనుఁడై పడియెను.

అట ధర్మతనయుఁడు కొంత తడవు చూచి సహా

దేవుతో "సహదేవా! మన నకులుఁడు జలములకు బోయి యే కారణముననో యింతవఱకును రాలేదు. నీ వచ్చటికిఁ బోయి దాహము దీర్చుకొని యాతనిని దోడ్కొని రమ్ము!" అని పంపెను. ఆతఁడును నతి త్వరితముగాఁ బోయి యా తటాకతీరమునఁ బడి యున్న నకులునిని జూచి యాశ్చర్య పడెను; విచారపడెను; అట్లగుటకుఁ గారణ మేమియో యని యాలోచించెను. కాని దాహము నాపుకొనలేక యా కొలనిలోనికిఁ దానును దిగఁ జూచుచుండెను. అప్పు డా యశరీరభూతము "ఓ యనఘ! ఈ జలాశయము నా యధీనమై యున్నది. కావున నా ప్రశ్నముల కుత్తరము లిచ్చినఁ గాని యిందుఁ జొరఁ జనదు" అనెను.

ఆ మాటలను నాతఁడును నాదరింపక యా నీరు ద్రాగి పడిపోయెను.

అంత ధర్మాత్మజుఁ డర్జునునితో "అర్జునా! నీ తమ్ములు పోయి కడుఁ దడవయ్యెను. ఈ యరణ్యమున నేమి సంభవించెనో వేగిరముగా నేఁగి వారలను దోడ్కొని రమ్ము!" అని యర్జునుని గూడను బంపెను. ఆతఁడును నా కొలని దగ్గఱకుఁ బోయి దాని యొద్దునఁ బడియున్న మాద్రిసుతులను జూచి మిక్కిలి విషాద మందుచు నాలుగు దిక్కులు గనుఁగొనెను. ఎవ్వరును గానఁ బడలేదు. తన్ను బీడించు

చున్న దాహమును శాంతింపఁ జేసికొనుటకై యా కాసారములోనికి దిగ నారంభించెను.

అప్పు డాకాశవాణి “ఓ రాజపుత్రా! ఇందలి జలములను బలిమిని ద్రావఁ జొచ్చిన వారలకుఁ బ్రాణముపై వచ్చును. నీవును నిందలి తోయమును ద్రాగఁ దలఁచితివేని నే వేయు ప్రశ్నముల కుత్తర మిమ్ము!” అనెను.

ఆ మాటల కర్జునున కెంతో కోపము వచ్చినది. అప్పు డాతఁడు గొంతెత్తి “ఎవ్వఁడవు రా! నీవు దొంగవై చాటున డాఁగి యుండి యట్లు ప్రేలుచున్నాఁడవు. ఇదే చూడుము! నీ పొగ రడఁగించెదను” అని యా శబ్దము వినవచ్చిన తావునకు శబ్దభేదిశరములనువదలెను. కాని వానివలన నెంతమాత్రమును బ్రయోజనము లేకపోయెను. ఎప్పటివాక్యము మఱియు వినఁబడెను. అతఁ డలసియుండుటచే సాహసముతో నందలి నీరు ద్రావి భూమిపైఁ బడెను.

అందు ధర్మసూనుఁడు భీముని జూచి “భీమసేనా! నకుల సహదేవులే కాక యర్జునుఁడును జలములు తేఁబోయి యింత దనుకను రాకుండుటకుఁ గారణ మేమై యుండునో నీవును బోయిరమ్ము!” అని పంపెను.

ఆ భీమసేనుఁడును నా సరస్సు నొడ్డున నిద్రావశులవలెఁ బడియున్న తమ్ములను గని దుఃఖించెను. “నిజముగా నిది మనుజులు చేసిన పని కాదు. దేవతు లెవ్వరో చేసి

యుందురు! ఎవ్వరైనను జేయనిమ్ము! తర్వాత నాలోచించె
దను గాక! ముందుగా నీ సరోవరమును జొచ్చి దాహ
మును దీర్చుకొనినఁ గాని నా ప్రాణములు నిలుచునట్లు లేదు"
అనుకొని యందుఁ దిగి నీరు త్రాగఁ బోయెను.

ఎప్పటిభూతము 'అయ్యా! నీ వట్టి సాహసము చేయ
వలదు. నీ కా జలములను ద్రాగవలయు నని కోర్కె
యున్న యెడల నే నడిగిన యర్థముల కుత్తర మిచ్చి
త్రాగుము!' అనెను.

ఆ మాటల నా భీమసేనుఁడును లెక్కచేయక యందలి
సలిలములను ద్రాగి తమ్ములతోపాటు తానును దత్తీరమున
మూర్ఛితుఁడై పడెను.

ఆ చెట్టునీడనున్న ధర్మరాజు తన తమ్ములు నలువురును
గూడ నీరు తేఁబోయి రాకుండుటవలన విచారపడుచు దానును
నా సరోవరము చెంతకు వచ్చెను. దాని తీరమునఁ బడి
యున్న తమ్ముల నందఱను గాంచి మిగుల దుఃఖించెను.
కొంత సేపు చిత్రమున నున్న రూపుఁ బోలె నిశ్చేష్టుఁ
డయ్యెను. అంతఁ గొంతసేపటికిఁ దెలివి తెచ్చుకొనెను.
నలు దెసలు పరికించి చూచెను. తనలో "ఇది యేమి
చిత్రముగ నున్నది. ఇతరు లిచ్చోటికి వచ్చిన జాడయూ లేదు.
పోరాడిన తెఱఁగును బొడసూపదు. నా తమ్ములు చూడ
నిట్లు పడియున్నారు. ఒక వేళ క్రూరుఁడు దుర్యోధనుఁ డేదేని

రియొక మాయచే నిట్లు చేసియుండునా! కుటిలబుద్ధుల నెవ్వ
రైనను నమ్ముదురే! వీరి వదనములు చూడఁ దెలివి కలి
గియే యున్నవి. వీ రిట్లు పడి యుండుటకుఁ గారణ మీ
తటాకములోని జలములు విషపూరితము లని తలఁపఁ దగి
యుండ లేదు! ఏమి మాయయో యెఱుఁగఁబడకున్నది.
అయ్యో! రాజ్యమునే కాక సర్వ సంపదలను వైరుల పాలు
చేసి యీ యరణ్యమున భీకరమృగాళి పొత్తున వీరల నిట్లనా
థులను జేసెనే యా విధాత! ఇఁక నే నెక్కడికిఁ బోదును!
నా దుఃఖ మెట్లు తీఱును! నే నొక్కఁడనై యింటికిఁ బోదు
నేని నా తల్లి నా కెదురుగా వచ్చి కౌఁగిటఁ జేర్చి "నాయనా!
ఆ నాఁడు తమ్ములును నీవును గానముల కేఁగితిరే! ఇప్పుడు
వార లెచ్చటికిఁ బోయిరి?" అని యడిగినపు డామెకు నే
నేమని చెప్పువాఁడను! ఆచార్యవిదురాదులు "మీకుఁ గుశ
లమా?" అని యడిగిరేని నేనేమనఁ గలవాఁడను! "అయ్యో!
నాకు దిక్కేమి?" అని పెక్కు దెఱఁగులను వగచెను.

ఆ ధర్మజుఁడును దాహము నిలుపుకొనఁ జేరక యాతటా
కములోనికే దిగఁగా నా యక్షరూపభూత మా యనతోడను
"ఓ భూనాథా! ఇది వినుము! నే నొక బకమును. ఈ కొలను
నా సొమ్ము; నీ తమ్ములు నా మాటను లెక్క చేయక
యిందలి నీరు త్రాగియే యిట్లు పడి యున్నారు. సాహసము
నకుఁ జొచ్చితివేని నీవును నట్లయ్యెదవు; నే నడిగిన యుగ్ర

ముల కుత్తరము లిచ్చి యుంజలి జలములను గ్రోలుము!" అనెను.

అంత ధర్మతనూభవుఁడా బకము వంకఁ జూచి "అయ్యా! నీవు బకరూపమును ధరించి యున్న రుద్రుఁడవో! పావకుఁడవో! పవనుఁడవో! నై యుందువు. అట్లు కాని పక్షమునకు నా తమ్ముల నిట్లు పడఁద్రోచి నట్టి బలము పక్షుల కెక్కడిది! నా కద్భుత భయ సంతోషములు కలుగుచున్నవి. నీ వెవ్వఁడవు? నీ తలఁ పేమి? నాకుఁ జెప్పి నా హృదయవేదనను బాపుము!" అనెను.

అత్తఱి నా యదృశ్యభూతము "ఓ ధర్మనందనా! నేను దుర్యోధనుని బకమును గాను; నే నొక యక్షుఁడను. నా వలననే నీ తమ్ము లింతుఁ బడి యుండిరి" అని యక్షుఁడు ఘోరాకారముతో నా తటాకతీరమున నిలిచెను.

అంత ధర్మరాజతో "నా యనుమతి లేకుండఁగ నిందలి నీరు ద్రావిరేని యెవ్వరైనను జచ్చుట నిశ్చయము. నీవు విచారశీలుఁడ వగుటచే నట్లు చేయు వని నాకుఁ దెలియును. అందుచే నీవు నే నడిగెడి ప్రశ్నముల కుత్తరము చెప్పుము" అనెను.

అప్పుడు ధర్మరాజా యక్షునితో "మహాత్మా! నీ మనస్సునకు వచ్చినట్లుగాఁ జెప్పుటకు నావంటి వానికి

శక్యమగునా! అయినను నా శక్తికొలఁదిని జెప్పెదను; ప్రశ్నింపుము!" అనెను.

*యక్షుఁడు:—మనుజునకు దేనిచే మహిమ యేర్పడును?

ధర్మరాజు:—అసమాన మగు తపముచేత

యక్షుఁడు:—మనుజున కేది సదా సాహాయ్యమై యుండును?

ధర్మరాజు:—ధృతి (ధైర్యము)

యక్షుఁడు:—మనుజుఁడు దేనివలన బుద్ధిమంతుఁడగును?

ధర్మరాజు:—పండితసేవవలన

యక్షుఁడు:—బ్రతికియున్నను జచ్చినవాఁడే యని యెవని నందురు?

ధర్మరాజు:—దేవతలకు, అతిథులకు, పితరులకు, భృత్యులకుఁ బెట్టకయే తన కడుపునకు మాత్రమే భుజించువానిని

యక్షుఁడు:—భూమికంటెను భారమైన దానిని, ఆకసముకంటెను బొడవైన దానిని జెప్పుము?

ధర్మరాజు:—ధరణికంటెను భారమైనది తల్లి; ఆకసముకంటెను బొడవు తండ్రి.

యక్షుఁడు:—గాలికంటెను వేగముగాఁ బోవున దెద్ది?

ధర్మరాజు:—మనసు

* ఇంకను గొన్ని ప్రశ్నోత్తరములు పిల్లలకు బాగుగాఁ దెలియ వలెనను తలఁపుతో పొందింపఁ జేయఁ బడినవి.

యక్షుఁడు:— తెరువు నడచువానికిని, రోగార్తునకును, గృహస్థునకును, మృతి బొందినవానికిని నెవ్వరెవ్వరు చుట్టములు?

ధర్మరాజు:— తెరువునడచువానికి సార్థమును, రోగికి వైద్యుఁడును, గృహస్థునకు సద్భార్యయు, మృతినొందిన వానికిఁ జేసిన ధర్మమును

యక్షుఁడు:— సుఖమునకుఁ గారణ మేది?

ధర్మరాజు:— శీలము

యక్షుఁడు:— లోకమునకు దిక్కేది?

ధర్మరాజు:— సజ్జనులే లోకమునకు దిక్కు

యక్షుఁడు:— నీ సదుత్తరములకు మిక్కిలి సంతోషించి తిని. నీ తమ్ములం దొకని ప్రాణముల మాత్రమే యిచ్చెదను వేఁడుము!

ధర్మరాజు:— నకులుని బ్రదికింపుము!

యక్షుఁడు:— అతిబలులును నీకుఁ బ్రియులును నగు భీమార్జునులలో నొకని గోరక యిట్లు నకులుని గోరితి వేమి?

ధర్మరాజు:— మా తండ్రి యగు పాండురాజున కిరువురు భార్యలు. అందుఁ గుంతీపుత్రులగు మువ్వురిలో నేను బ్రదికి నాఁడను. మాద్రి తనయు లిరువు రందు నొకఁడు బ్రదుక వలదే! అదియే కదా ధర్మము! ప్రాణహానికైన నోర్వఁగలను గాని ధర్మహానికి నోర్వఁజాలను.

యక్షుఁడు:—ధర్మరాజా! నీ ధర్మజ్ఞతకు మెచ్చితిని! నీ తమ్ములందఱును సజీవు లగుదురు గాక!

అని యక్షుఁ డనినంతనే విగతప్రాణులై పడియున్న యా నలుగురును నిద్రపోయి మేల్కొని నట్లు లేచిరి. అంత ధర్మరాజు యక్షుని జూచి "అయ్యా! నేను నిన్నొక యక్ష మాత్రుఁడ వని యనుకొనను. శక్రుఁడవో, యమలోకాధిపుఁడవో యనలుఁడవో పవనుఁడవో యై యుందువు. అట్లు కాదేని నాకు జనకుఁడ వగు ధర్మదేవతవో యై యుందువు. నా కది వివరముగాఁ జెప్పుము! ఆ మాటల కాతఁడు "ధర్మజ! నేను ధర్ముఁడను సుమా! [1]సత్యము, [2]శౌచము (పవిత్రత) [3]దానము, [4]తపము, [5]శమము, [6]శాంతి, [7]యశము, [8]పరిజ్ఞానమును నాకు మూర్తులు.

---

1. సత్యము:—ఎల్లప్పుడును సత్యమునే చెప్పుచుండుట.

2. శౌచము:—దేహ వస్త్ర వాసస్థలాదులను శుభ్రముగా నుంచుకొనుటయే కాక మనస్సును నిర్మలముగాఁ జేసికొనుట.

3. దానము:—తన శక్తినిబట్టి దానార్హులైన వారికిఁ ద్రవ్యము నిచ్చుట.

4. తపము:—భగవంతుని యందు మనస్సును నిలిపి యుంచుట.

5. శమము:—కంటికిఁ గనఁబడిన దాని నెల్లను గావలయు నని తలంచకుండుటయే కాక కోపము, లోభము మొదలగు దుర్గుణములు లేక యుండుట.

6. శాంతి:—బ్రహ్మచర్యము, తపము మొదలగు వానియందుఁ గష్టములు కలుగుచున్న నోర్చుకొనుట.

ఆయుత్తమధర్మములు కల నిన్ను జూచువేడుకతో వచ్చితిని. ఆ ధర్మముల నాశ్రయించిన వారలకుఁ గేటు మూడదు; కావున నీ కిష్టమగు వరము నింకొక దానిని వేఁడుము.

ధర్మరాజు:—అయ్యా! నా యాశ్రమమున నుండెడి యొక బ్రాహ్మణుని యొక్క యరణి యొక హరిణ మెత్తుకొని పోయినది. ఆయనకుఁ గర్మలోపము కలుగకుండ దాని ననుగ్రహింపుము!

ధర్మదేవత:—నేను నీమనస్సును బరీక్షింపఁగోరి యా [illegible] యరణిని హరించితిని కాని హరిణ మెందుఁ గలదు?

అని చెప్పి యావస్తువును ధర్మజున కిచ్చెను. అంత ధర్మరాజాదు లా యరణిని దమ యాశ్రమమునకుఁ దెచ్చి యా బ్రాహ్మణున కిచ్చి పరమానందము నందిరి.

—:ప్రకాశము:—

"సత్యశౌచాదులతోఁ గూడిన వారలను భగవంతుఁడు సదా కాచును. అట్టి వారలే ప్రపంచమునఁ బ్రఖ్యాతి గల వార లగుదురు"

---

7. యశము:—మంచి పనుల చేసి కీర్తి తెచ్చుకొనుట.

8. పరిజ్ఞానము:—ప్రపంచ మందలి సకల పదార్థములను గూర్చి తెలిసికొనుట.

( నాలుగవ దీపము )—

# లోభి

ఒక గ్రామములోఁ బిసినిగొట్టొకఁ డుండెను. అతని కొక నాఁ డొక కొబ్బెరకాయ కావలసి వచ్చెను. అందుల కాతఁడు అంగడివీధికిఁ బోయి యొక యంగడివాని నొక కొబ్బెరకాయ యొక్క వెల యెంత యని యడిగెను.

ఆ యంగడివాఁ డొక్కొక్కకాయ వెల ముక్కాని యని చెప్పెను. ముక్కాని యిచ్చి కొనుట కా లోభి కంగీకారము లేక "ఓ వర్తకుఁడా! అంతటను దర యిట్లే యున్నదా! ఎందైనను గొంత తక్కువ మూల్యమునకు దొరకునా!" అని యడిగెను. దాని కా వర్తకుఁడు "అయ్యా! ఇచ్చటికి మూఁడుక్రోసుల దూరమునం దొక పట్టనమున్నది. అచ్చటకుఁ బోయిన పక్షమునకు రెండుకానుల కొక కొబ్బెరకాయ దొరకును" అనెను. ఆ మాటల కా పిసినిగొట్టొక కొబ్బెరకాయ కంత దూరము నడచి పోవుటేమి! ఒక కానికై చూచుకొనవలయునా యని యాలోచింపలేను. పిసినిగొట్టుల కట్టి యాలోచనలు పుట్టును ఎప్పుడును వారు ద్రవ్యము వ్యయము కాకుండఁ దమకుఁ గావలసిన వస్తువులకై చూచుచుందురు. అందుచే నా లోభి తిరిగి యింటికైనను బోక యే దారి పట్టి యా నగరమునకుఁ బోయెను. అందున్న యొక యంగడికిఁ

పోయి "ఓవర్తకుఁడా! నాకొక కొబ్బరకాయ కావలయును. ఎంత వెల కిచ్చెదవు?" అని యడిగెను. అతఁడా లోభితో "అయ్యా! ఒక్క కొబ్బరకాయవెల రెండుకానులు" అని చెప్పెను.

అంత వెలయిచ్చి కొనుట కా లోభి కిష్టము కాలేదు. ఒక కాని కొకటి యీయవా! అని యడిగెను. ఆ యంగడి వాఁడు "అయ్యా! ఇక్కడకు రెండు క్రోశముల దూరములో నొక తోఁట కలదు. తా మచ్చటికిఁ బోయితిరా యొక కాని కొక కొబ్బరకాయ దొరకును" అని చెప్పెను.

లోభు లెంతటి కష్టమునైననుఁ బడుదురు; కాని తమకు ముఖ్యముగాఁ గావలసిన పదార్థమునకైనను ద్రవ్యమును వ్యయము చేయఁజూడరు. కావున నా లోభి "నాకా తోఁటలోఁ గాని కొకటి లభించుచుండ వ్యర్థముగా నొక కాయకై రెండు కాను లేల యీయవలయును. ఇంతదూరము నడచి వచ్చిన వాఁడను మఱి రెండు క్రోశముల దూరము నడువఁ జాలనా! ఆ తోఁటకే పోయి యొక కానికిఁ గొనెదను" అను కొనెను.

అచ్చట నుండి బయలుదేఱి యా తోఁటదగ్గఱకుఁ బోయెను. ఆ తోఁటవానితో "నా కొక కొబ్బరకాయ కావలసి వచ్చితిని! ఎంత వెల కిచ్చెదవు?" అని యడిగెను. అతఁడు "అయ్యా! ఒక కాని కొక కాయ యిచ్చుచున్నాఁడను" అనెను.

అంతట నా లోభి మన మింత దూరము వచ్చి [illegible]

కాని మాత్ర మొదులకు వెచ్చింప వలయును! ఇది తోఁట కదా! ఊరక వచ్చెడి సూత్రము నేల కనిపెట్టరాదు అను కొని యాతోఁటవానితో "నేను చాలదూరమునుండి యిక్కడకు మంచి కాయలు దొరకు నని వచ్చితిని; నా కెట్లయిన నొక కాయ యూరక వచ్చెడి యుపాయమును జెప్పవలయును" అని వానిని బ్రార్థించెను. అంతట నా తోఁట కాపరి "అయ్యా! మీరు చాలదూరమునుండి యొక కొబ్బెర కాయకై వచ్చితి మనుచున్నారు కావున నా చెట్టెక్కి యొక కాయను గోసికొనుఁడి! నా కొక దమ్మిడి యైన నీయ నక్కఱ లేదు" అనెను.

అంత నా లోభికిఁ గలిగిన సంతోష మింతింత యని యనరా కుండెను. అందుచేత నాతఁడు "చెట్టెక్కుట యెంత పని! అటు తరువాత నాతఁ డొక కాయను దీసికొ మ్మనెను గాని మనము మఱి నాలుగు కాయలను దీసికొన వచ్చును" అనుకొని చెట్టుపై కెక్కెను. పిసినిగొట్టుల కాశ యిట్టిది యే కదా! బాలకులారా! ఆ లోభి యా తోఁటలో నున్న కొబ్బెరచెట్టుపై కెక్కిన పిదప నేమయ్యెనో కొంచెముగాఁ దెలిసికొనుఁడి!

ఒక కొబ్బెరకాయను గెలలోనుండి యూడఁదీయుటకు మొదలు పెట్టెను. అంతలోఁ గాలు జారెను. ఆ గెలను బట్టుకొని వ్రేలాడుచుండెను. గిజగిజ తన్నుకొనుచుండెను.

అప్పు డొకఁ డొక వంటెపై నెక్కి యా దారిని బోవుచుండెను. వానిని జూచి యా లోభి "అయ్యా! నా కాలి నెట్లయినను నీ చెట్టునకుఁ జేర్చుము. అట్లయినపక్షమున నేను మెల్లఁగాఁ జెట్టుపైనుండి క్రిందికి దిగి ప్రాణములను నిలుపుకొందును" అనెను. ఆ మాట కా యొంటెను నడపుకొని పోవువానికి దయ పుట్టి తా నా యొంటెపై నిలఁబడి యా లోభి యొక్క రెండు కాళ్లను బట్టుకొని చెట్టునకుఁ జేర్చునంతలో నా యొంటె యందుండి తొలఁగి పోయినది. లోభుల పాదములను బట్టినవారి కంతకంటె నెక్కువ స్థితి యబ్బునా! పాప మాతఁడును నా లోభి పాదములను బట్టుకొని వ్రేలాడుచు "అయ్యా! నీవు కొమ్మరెంటను గట్టిగాఁ బట్టుకొనుము! దానిని విడిచితివా మన మిద్దఱమును గూడఁ గ్రిందఁబడి చచ్చుట నిజము. అట్లు చేయకుందువేని నీ కేనూఱు రూప్యముల నిచ్చెదను" అనెను.

లోభులు తా మెంత కష్టపడుచున్నను దమకు ద్రవ్యలాభము కలుగుననెడి మాటయే వినఁబడినను మహాసంతోషముతో నుందురు. తిరువాతి నది లభింపకపోయినను సరియే! అట్లు వా రిద్దఱును వ్రేలాడుచుండఁగా నా మార్గముననే యొకఁడు గుఱ్ఱము నెక్కి వచ్చుచుండెను. అతనిని జూచి యొంటె నెక్కి వచ్చినవాఁడు "అయ్యా! నా పాదముల నీ చెట్టునకుఁ జేర్చితివేని నీ కెంతో పుణ్యము వచ్చును. నేనును జెట్టునుండి

ప్రాణముతోఁ గ్రిందికి దిగి రాఁగలను" అని వేఁడుకొనెను. ఆ గుఱ్ఱపువాఁడు కొంచెము దయకలిగి తన గుఱ్ఱముపై నిలిచి యాతని పాదములను బట్టుకొని చెట్టువంకఁ ద్రోయు నంతలో నా గుఱ్ఱము కూడ నావలకు నడచిపోయెను.

అప్పుడు గుఱ్ఱము నెక్కి వచ్చినవాఁడును మిక్కిలి భయపడుచు నా లోభితో "నాయనా! నీ వా గెలను మాత్రము వదలకుము! అట్లు కావించితివేని మనమెల్లరమును నేలఁగూలి మృతినందవలసిన వారల మగుదుము! అంతియే కాక నేను నీకు వేయి రూప్యములనుగూడ నిచ్చెదను" అని మొఱపెట్టుకొనెను.

ఆ మాటలో లోభి కెంతో సంతోషము వచ్చినది. ఎంత కష్టపడిన నేమి! ద్రవ్యము సంపాదించుకొనుటయే మనుష్యునకు ముఖ్యమైన పని. ఆహా! నాకు వీఁడ్డఱి వలనను "ఇంత ద్రవ్యము నాకిప్పుడు వచ్చుచున్నది" అని తన రెండుచేతులను జాఁచెను.

అంత నా ముగ్గురును నేలఁగూలిరి. లోభికి మాత్రము చావు తప్పి కన్నులొట్ట పోయినది. తక్కిన వారిద్దఱును దేవుని దలఁచుకొనుచు "ఇట్టి పిసినిగొట్టుల కెన్నఁడు నుపకారము చేయరాదు" అని తమ వాహనముల నెక్కి పోయిరి.

—: ప్రకాశము :—

"పిసినిగొట్టుతనము కలవారలు తాము బాధపడుటయే కాక యితరులను గూడ బాధపెట్టుచుందురు. మఱియు నట్టి

వారలు దొంగతనము చేయుటకుఁ గాని యసత్య మాడుటకుఁ గాని హత్య చేయుటకుఁ గాని వెనుదీయరు. ఇంతయేల! వారలు చేయునది చెడుపనియే కాని మంచిపని యొకటియు నుండదు."

—( అయిదవ దీపము )—

## భీష్ముఁడు

కురుకులమున శంతనుఁ డను రాజొకఁ డుండెను. అతఁ డొకప్పుడు గంగతీరమున నున్న యడవులలోనికి వేఁటకై వెడలెను. అప్పు డొక స్త్రీ యా రాజునకుఁ గాన్పించెను.

ఆమెతో "ఓసుందరీ! నీవు నాకు భార్యగా నుంటివేని నీకు సకలభాగ్యములను గలిగింతును" అనెను.

ఆమెయు "ఓ రాజా! నేను నీభాగ్యమునకై వాంఛించి వచ్చినదానను గాను. నీవు నాకు "నే నెన్నడును నీమనస్సు నొచ్చునట్లు పలుక ననియు; నీవు చేయు పనులను వలదన ననియు వాగ్దాన మొనర్చితివేని నీకు భార్య నయ్యెద"ననెను.

అందుల కా శంతనుఁ డంగీకరించి యామెను భార్యగాఁ జేసికొని స్వనగరమునకుఁ దోడ్కొనిపోయెను.

ఆమె యెవ్వతయో యెఱుఁగుదురా! గంగాదేవియే స్త్రీ రూపముతో నచ్చటికి వచ్చినది.

అంతఁ గొంత కాలమునకా గంగాదేవి గర్భవతియై యొకపుత్రుని గనెను. ఆమె యా పుత్రుని నేమి చేసినదో యెఱుఁగుదురా! కనినంతనే యా బాలుని దీసికొని పోయి గంగలోఁ బాఱవైచినది. అంతటితో నా కని చాలింపలేదు. అట్లే క్రమముగా నేడుగురను గని గంగపాలు చేసినది.

ఆ రాజు "తానేమైన ననిన పక్షమున నామె లేచి పోవును" అను భయముచే నా దుష్కృత్యము తన మనస్సు నెంత బాధించుచున్నను నోరు మెదల్ప లేకపోయెను. ఆమె యందాతని కెంత ప్రేమయున్న నట్టి క్రూరకార్యమునే చేయుట కెంతకాల మంగీకరించి యుండును. ఆతనికి మాత్రము పుత్ర ప్రేమ లేదా!

ఆమె కెన్మిదవ పుత్రుఁడు పుట్టెను. ఆతనిని గూడను గంగలోఁ గలుపుటకుఁ జూచుచుండెను. అప్పు డా రాజు "ఈమె నాకడ నుండిన నుండనిమ్ము! పోయినఁ బోనిమ్ము! ఆ ఘోరకార్యము నిఁకఁ జూడఁ జాలను" అనుకొనెను.

అంతట నామెతో "ఓ వనితా! కన్నబిడ్డలను గంగలోఁ బాఱవైచు వారల నెందునుజూడను! "ఈమె బిడ్డను గనెను" అని వినిన లోకులు తన్ను వెలివేయుదురేమో యను భయము కల వనిత యైనను బిడ్డను గని యొరుల కిచ్చివేయును; కాని

చేతులార నిట్టి చెఱుపని చేయఁ జాలదు! ఇంత దనుకను నీతోఁ జేసిన బాసను బట్టి నోరు మెదల్పలేక యూరకుంటిని. ఇఁక నీవు నాకడ నుండుము! ఉండక యిప్పుడే పొమ్ము! నేను మాత్ర మిప్పుడీ పుత్రుని గంగలోఁ గలుపనీయను" అని కోపముతోఁ బలికెను.

అంతట నా గంగాదేవి "ఓ భూపాలా! అట్లయినచో మనకు నీకును నాకును గల మైత్రి నేఁటితో నంత మొందినది. ఇంతవఱకును నే నెవ్వత నని భావించియుందువో! నేను గంగను; వసిష్ఠుని శాపముచే భూలోకమున జనింప వలసి వచ్చిన వసువులు నా కడకు వచ్చి "అమ్మా! నీ కడుపున నే కాని మఱియొక తె కడుపునఁ బుట్టుటకు మా కిష్టము లేకున్నది. మేము నీకుఁ బుట్టిన తర్వాత మమ్ములను మాత్రము చిరకాలము భూమిపై నుండకుండునట్లు చేయుము" అని వేఁడికొనిరి.

ఆ వసువుల కా వాంఛితమును దీర్ప నీకు భార్య నై పుట్టిన పుత్రు నెల్ల గంగలోఁ బాఱవైచితిని. ఈ యష్టమ పుత్రుఁడు మాత్ర మట్లు గాక యశోవంతుఁడై చిరకాలము జీవించును. ఈతఁడు పెరిగి పెద్దవాఁ డగు నంత దనుకను నా కడనే యుండవలయును" అని చెప్పి గంగ తన తనయుని దోడ్కొని నిజస్థానమునకుఁ బోయెను.

అంత నా గంగాదేవి తన కుమారునకు "దేవవ్రతుఁడు"

అని నామకరణ మొనర్చినది. ఆ బాలుఁడు బ్రాహ్మణవీరుఁ
డగు పరశురాముని కడకు బోయి సమస్త శస్త్రాస్త్రవిద్య
లను గఱచెను. ఆ పరశురాముఁడు సామాన్యుఁడు కాఁడు.
ముందు వేదగ్రంథముల మూటను వెనుకను నమ్ముల
పొదిని వైచికొని "ఇది బ్రాహ్మణ్యము! ఇది క్షాత్రము!"
కావున నేను శాపము వలనను శరము వలనను గూడ జగ
మును జయింపఁ గల నని చెప్పి సకలలోకమును జయించిన
బ్రాహ్మణశూరుఁడు.

అట్టి మహావీరుని చెంత విద్యాభ్యాస మొనర్చి యొక
నాఁడు దేవవ్రతుఁడు గంగాతీర మందలి యిసుకతిన్నెలలో
బాణములు వేయుట యందుఁ దనకుఁ గల నేర్పును జూచు
కొనుచుండెను. ఆ సమయమునఁ దండ్రి యగు శంతనుఁడు
కూడ నచ్చటికే వచ్చియుండెను. ఆ కుమారుని దివ్యతేజ
మును జూచి యాశ్చర్యపడుచు నట్టె నిలిచి చూచుచుండెను.
పుత్రుల యభివృద్ధిని గాంచినపుడే కదా తండ్రుల కట్టి యానం
దము కలుగును.

ఆ గంగాదేవియుఁ దన కొమరుఁ డగు నా దేవవ్రతుని
నా శంతనున కప్పగించుటకు మంచి సమయ మనుకొనెను.
ఆమె యు నచ్చటికి వచ్చి తన తనయుని హస్తమును బట్టుకొని
శంతనుని చెంతకుఁ జేరఁదీసి "ఓ రాజా! ఇఁక నీ పుత్రుని
నీవు దీసికొని పోవచ్చును. ఇదే నీ కప్పగించుచున్న దానను"
అని చెప్పి యా శంతనునకుఁ బుత్రు నప్పగించెను.

అంతఁ దపరిమితానందముతో నాత్మజుని వెంట నిడుకొని తన నగరమునకు వచ్చెను.

అంతట నొక శుభవాసరమునఁ దన సుతునకు యౌవరాజ్యాభిషేకమును గావించెను.

అట్లు యౌవరాజ్యాభిషిక్తుఁ డగు దేవవ్రతుఁడు నిజ ధర్మవర్తనముచేఁ బ్రజల నెంతయో యానందపెట్టుచుండెను.
ఆ విధముగాఁ బ్రజలకే యానందము కలుగుచుండఁగాఁ దండ్రి కెంత సంతసముండునో యెవరు చెప్పఁగలరు!

ఆ తీరునఁ గొన్ని యేండ్లే గడిచిపోయినవి. పిమ్మట నొకనాఁడు శంతనుఁడు యమునానదీతీరమునకుఁ బోయెను. అం దొక యోడ నడుపుచున్న కన్యను గాంచెను. ఆయన కామెను పెండ్లి చేసికొనవలయు నను బుద్ధి పుట్టినది. వెంటనే యామె కడకుఁ జని యా బాలికను "ఓ బాలా! నీ వెవతవు? నీకుఁ దల్లిదండ్రు లెవ్వరు?" అని యడిగెను. ఆ రాజుమాటల కా బాల "అయ్యా! నేను దాశరాజను వానికి బుత్రికను. నా పేరు సత్యవతి. నేను ధర్మార్థముగా నీ యమునానదిపై నోడ నడపుచుందును" అని ప్రత్యుత్తర మిచ్చెను. అంతట శంతనుఁడు సత్యవతి తండ్రి దగ్గరకు వెడలి యాతనితో "ఓ దాశరాజా! నే నొక తలఁపుతో నీ చెంత కిప్పుడు వచ్చియున్నాఁడను:— నీవు నీ కొమార్తెను నాకిచ్చి వివాహము చేయవలయును" అని యనెను. అందులకా దాశరాజు నతనిని

నంగీకారము కలదు; కాని యా రాజుతో "అయ్యా! నా కూఁతురుకుఁ బుట్టిన పుత్రునకే పట్టము గట్టెద నని గట్టిగా మాట యిచ్చిన పక్షమునకుఁ దప్పక మా సత్యవతిని నీకు వివాహము గావించెదను" అనెను.

ఆ మాట వినినతోడనే శంతనుని గుండె జల్లుమనినది. ఏల యనిన కారణము! అంతకు ముందే తనకు గంగయందుఁ బుట్టిన పుత్రునకు యౌవరాజ్యాభిషేకము చేసి యుండెను. అయినను వాఁడు జ్యేష్ఠపుత్రుఁడు గదా! అందుచేత నాశంతనున కేమియుఁ దోఁచలేదు. విచారముతో మాఱుమాటాడక నిజనగరమునకుఁ బోయెను.

ఆ శంతనుఁ డెల్లప్పుడు చేరె నను మాటయే కాని సత్యవతిని బెండ్లాడవలయు ననెడి కోరికతో నిద్రాహారములను మానివైచెను. అందుచే నా రాజు నానాఁటికి శుష్కింప మొదలుపెట్టెను.

తండ్రి యీ విధముగా నిద్రాహారములు మానివైచి చిక్కి శల్యమగుటఁ జూచి గాంగేయుఁడు విచారగ్రస్తుఁ డయ్యెను.

ధర్మజ్ఞులైన పుత్రులకుఁ దల్లిదండ్రులయెడ నట్టి భక్తి యుండకమానదు.

అప్పుడు జనకుని సమీపమునకుఁ బోయి "పితా! నీ వా నాఁడు వేటకై వెడలి వచ్చిన నాఁటనుండియు నే కారణముననో రాజకార్యముల నెంతమాత్రమును జూచుట మాని

వైచిత్రి. అందుచే నీవు దీర్ఘచింతతో నున్నట్లు భావించు
చున్నాఁడను. మనకు రాజ్యవిషయిక మగు చింత యావంత
యైనను లేదు! ప్రజలే బాధయును లేక సకలసంపదలతోఁ
దులతూఁగుచున్నారు. మనకు శత్రువు లెవ్వరును గానరారు.
అట్లగుచో నీ పరితాపమునకుఁ గారణ మేది యో తెలియరా
కున్నది" అనెను.

ఆ విధముగాఁ బుత్రుఁడు పలికిన పలుకులు తండ్రి విని
సుతునితో మెల్లగా 'ఓ కుమారా! ఒక పుత్రుఁడు పుత్రుఁడు
కాఁడు; ఒక కన్ను కన్ను కాదు" అని పెద్దలు చెప్పుదురు.
అంతియె కాదు! నీవు శౌర్యము గలవాఁడవు; దానికిఁ దోడు
నీకు మహాపరాక్రమమును గలదు. యుద్ధమనిన నెంతమాత్ర
మును వెనుదీయని వాఁడవు కావున నెప్పటి కేమి సంభవిం
చునో యని శంకించుకొనుచున్నాఁడను. కాన నా కొక
కన్యను బెండ్లియాడవలయు నని తలంపు కలిగినది" అని తన
మనోరథమును వెలిపుచ్చెను.

గంగాపుత్రుఁ డగు దేవవ్రతుఁ డా మాటలు విని తన
తండ్రి యభిలాషయే యెట్టిదైనను జెల్లింపవలయు ననెడి
చిత్తముతోఁ గొంపజు నాపులను బాపి తన తండ్రి చిత్తము
సత్యవతిపైఁ జిక్కియుండుటను గ్రహించెను.

అప్పు డా దేవవ్రతుఁడు దాశరాజు దగ్గఱకుఁ బోయి
"ఓ దాశరాజా! మీ సత్యవతిని మా జనకున కిచ్చి వివా

పాము చేయవలయును. అందులకై నిన్ను వేడుకొన వచ్చితిని" అనెను.

ఆ దాశరాజు దేవవ్రతుని మాటలు విని "రాజపుత్రా! నీవు పరమపావనుఁడవు! నీకుఁ దెలియని ధర్మ మొక్కటియును లేదు. అందుచేతనే తండ్రికి సంతోష పఱుపు మా కన్య నడుగ వచ్చితివి; ఎంతయును సంతసముగా నున్నది. మీ తండ్రికి నే నొక మాట యిచ్చితి నది యెట్టిదనగా:- అదియును నీకుఁ దెలిసియే యుండును. అయినను నీతోడఁ గూడ మరల నొకమాఱు చెప్పెదను:— మా సత్యవతికిఁ బుట్టిన పుత్రుఁడే రాజ్య మేలవలయును" అనెను.

ఆ వచనములకు దేవవ్రతున కెంతయో సంతోషము వచ్చినది. ఆ దాశరాజుతో "ఓ దాశరాజా! అందుల కా నీవు సంకోచించు చుంటివి. అట్లు సంకోచింప వలసిన పని లేదు. మా తండ్రి యగు శంతనునకు సత్యవతియందుఁ గలిగిన కుమారునే రాజుగఁ జేసెదను" అని ప్రత్యుత్తర మిచ్చెను.

ఆ మాటకు దాశరాజునకు సంతోషము వచ్చెను; గాని యాతని చిత్తములో "ఈ దేవవ్రతుఁడు తా నిట్లు చేయఁగలవాఁడు కావచ్చు కాని తత్పుత్రు లగువారు రాజ్యమునకుఁ బోట్లాడి దీని పుత్రులకు బట్టి లేకుండఁ జేయునది లేకపోవును" అని యనుకొనెను. అంత నా దేవవ్రతునితో "రాజపుత్రా! నిజముగా నీవు దేవవ్రతుఁడవే యగుట వలన నట్లు ధర్మయుక్తముగాఁ

బలికితివి; కాని నీ కున్న తలఁపే నీకుఁ బుట్టెడు పుత్రుల
కుండునా! అప్పుడు కలహప్రియులగు ధీమంతులు బయలు
దేఱి నీ మాటను జెల్లింతురా! న్యాయస్థానముల కెక్కించి
చెల్లపాలును బచ్చలపాలును జేసి చేసి తుద కెందుకును
మనలను గొఱగాకుండఁ జేయురా! అట్టి స్థితి యెన్నఁడును
రాకూడదు" అనెను.

ఆ మాటలకు దేవవ్రతుఁడు దాశరాజుతో "ఓ దాశ
రాజా! ఇదిగో ముక్కోటికిని శపథము చేసి చెప్పుచున్నాఁ
డను. నేను నా తండ్రికై వివాహమాడను! ఆడను!! ఆడను!!!
నాకు వివాహ మాడుటకే యిచ్ఛ పొడమకున్నపుడు పుత్రు
లెటునుండి వత్తురు?" అనెను.

ఆ గాంగేయుఁ డట్లు చేసిన ప్రతిజ్ఞను మెచ్చుకొని
యాతని నప్పటినుండియు భీష్ముఁ డని పిలువనాగిరి.

ఆహా! ఆ భీష్మునకుఁ గల పితృభక్తి యిట్టిదని వర్ణింపఁ
గలమా! సకలభోగముల నిచ్చెడి రాజ్యమును దన తండ్రి
కొఱకు వదలుకొనుట యే కాక "బ్రతికి యున్నంత కాల
మును బ్రహ్మచర్యముతోడనే యుండెదను" అని ప్రతిజ్ఞ
చేసెను. ఆ విధముగాఁ బ్రతిజ్ఞ కావించి సకలభాగ్యములను
విడనాడుకొనిన పురుషులను జూడఁగలమా! శ్రీరాము
నకా! సీత యున్నది. అరణ్యవాసము చేసి వచ్చి పట్టాభి
షిక్తుఁ డయ్యెను.

ఆ ప్రతిజ్ఞను బట్టి దాశరాజు తన పుత్రికను శంతనున
కిచ్చి వివాహము చేసెను. ఆయన కామెయందు యిరువురు
పుత్రులు పుట్టిరి. మొదటివాని పేరు చిత్రాంగదుఁడు; రెండవ
వాని పేరు విచిత్రవీర్యుఁడు. వారు బిడ్డలును పెద్దవారు కాక
ముందే వారి తండ్రి మృతినొందెను.

అప్పుడు భీష్ముఁడు తా నని సల్లుగాఁ జిత్రాంగదునకు
రాజ్య మిచ్చెను. అతఁ డొక గంధర్వునిచే వధింపఁబడెను.

అంతట భీష్ముఁడు విచిత్రవీర్యునికిఁ బట్టముగట్టి తాను
రాజ్యరక్షణము చేయుచుండెను.

అట్లు కొంతకాలము జరుగఁగాఁ గాశీరాజు యొక్క
పుత్రిక లైన యంబ, అంబిక, అంబాలిక యను పేరి ముగ్గు
రను వరింప వలయు నని వివిధదేశముల నుండి మహారాజులు
వచ్చిరి.

భీష్ముఁడు వారి నందఱను జయించి యా ముగ్గురు
బాలికలను దన దేశమునకుఁ దీసికొని వచ్చెను.

ఆ కన్యకలను విచిత్రవీర్యునకుఁ బెండ్లి చేయవలయు
నని చూచుచుండఁగా నంబ యను బాలిక "తా నదివఱకే
సాల్వభూపాలుని వరించి యున్నదానను" అని చెప్పెను.

ఆ భీష్ముఁ డామెను మాత్రము బ్రాహ్మణులను గొంద
ఱను తోడిచ్చి యా సాల్వభూపాలుని పాలి కనిపెను.

అంబికాంబాలికలను మాత్రము భీష్ముఁడు తన తమ్ముఁడగు విచిత్రవీర్యునకుఁ బెండ్లి చేసెను.

ఆ యంబ సాల్వభూపాలుని చెంతకుఁ జేరఁగా వాఁడు "ఓ అంబా! నిన్ను భీష్ముఁడు తన రథముపై నెక్కించుకొని పోయెను; అందువలన నన్యపురుషునిచే స్పృశింపఁబడిన దాన వైతివి. నీవు నా కింకమాత్రమును బరిగ్రహింపఁ దగిన దానవు కావు!" అని నిరాకరించెను.

అప్పుడామె మరల భీష్ముని దగ్గఱకు వచ్చి సాల్వ భూనాథుఁడు తన్నుఁ బరిగ్రహించుట కంగీకరింపలే దని చెప్పి తన తోఁబుట్టువులతోపాటు తన్నును విచిత్రవీర్యున కే పెండ్లి చేయుమని వేఁడుకొనెను.

ఆ భీష్ముఁడు "ఓ అంబా! నీ చిత్త మన్యునియందుఁ దగిలి యున్నది; కావున నిన్ను నాసోదరున కిచ్చి వివాహము చేయుట కల్ల" అని కట్టిగాఁ జెప్పెను.

ఆ యంబ కన్య యేమి చేయుటకును దోఁచ లేక. తిన్నగాఁ బరశురాముని కడకుఁ జనినది. ఆయనతోఁ దన వృత్తాంత మంతయును జెప్పుకొనినది. ఎట్లయినను భీష్ముని బిలిపించి నన్ను విచిత్రవీర్యున కిచ్చి పెండ్లిచేయులాగునఁ జేయుఁడని ప్రార్థించినది.

అంత నా పరశురాముఁడు భీష్ముని బిలిపించి "ఓ భీష్మా! ఈ యంబను విచిత్రవీర్యునకుఁ బెండ్లి చేయుము!" అని

చెప్పెను. ఆ గురువచనమునకు భీష్ముఁడు "గురువరా! నేను మున్నె యీమెతో 'నీ వన్యాసక్తవై యుండుటవలన నా తమ్మునకు నిన్ను వివాహము చేయను' అని గట్టిగాఁ జెప్పినాఁడను. ధర్మవిరుద్ధముగా నే నట్టి పనిని జేయఁజాలను" అని ప్రత్యుత్తర మిచ్చెను. పరశురాముని కా మాటకుఁ గోపము వచ్చి యుద్ధమునకు సిద్ధపడెను. పుత్రులైన నేమి! శిష్యులైన నేమి! పట్టుదల గలవారలు తాము చెప్పిన మాటను జెల్లని బెట్టునపు డేదేని యొక విధముగా వారలను సాధింపఁజూతురు.

ఆ యంబా వివాహమునకై గురుశిష్యుల కిద్దఱకును బహు దినములు ఘోరసంగ్రామము జరిగెను. తుదకు గురువు శిష్యునితో "భీష్మా! నీ ధర్మబుద్ధికి నా కెంతయు సంతసము కలుగుచున్నది" అని భీష్ముని శ్లాఘించెను.

ఆ యంబతో పరశురాముఁడు "ఓ యంబా! నే నన్నివిధములను బ్రయత్నించి చూచిన నాతఁడు నిన్ను విచిత్రవీర్యునకు వివాహ మొనర్చు విధానము గావించుట లేదు. అతఁడు సత్యవాదుఁడు; కావున నిఁకను నేఁ జేయఁదగిన దెద్దియును లేదు! నీ యదృష్టము వచ్చినట్లు పడయుము!" అని చెప్పెను.

ఆ యంబయు రాజపుత్రిక యే కావున నెట్లైనను బట్టుబట్టి తపము గావించి తన కష్టస్థితికి హేతువైన భీష్ముని సాధింపనెంచినది.

విచిత్రవీర్యుఁడు సంతానము లేకుండఁగనే మృతి నందెను. శంతనుని వంశము నుద్ధరింతు రని యెంచిన చిత్రాంగద విచిత్రవీర్యు లిరువురును మృత్యువు వాతఁ బడిరి. వంశమా యంతటితో నశించిపోవు నట్లు కదా!

అప్పుడు సత్యవతి మిక్కిలి విచారించెను.

అంతట నామె భీష్మునితో "నాయనా! భీష్మా! కురువంశము నీతో నంత మొంద వలసినదే! నీవు వివాహము చేసికొని కురుకులమును నిలువఁబెట్టుము" అని యెన్నో విధములఁ జెప్పినది. ఆ తల్లిమాటలకు భీష్ముఁడు "అమ్మా! సూర్యుఁడు వేఁడిమిని విడిచినను విడువనిమ్ము! చంద్రుఁడు చల్లఁదనమును విడనాడినను విడనాడనిమ్ము! నేను మాత్రము నా శపథమును విడువఁ జాలను" అని ప్రత్యుత్తర మిచ్చెను.

అంత సత్యవతి చేయునది లేక తన ప్రథమ పుత్త్రుఁడగు వ్యాసుని దలఁచెను.

ఆయన వచ్చి "అమ్మా! నన్నుఁ దలఁచిన కారణ మేమి" అని ప్రశ్నించెను. ఆమె తన తనయుల మరణమును దెల్పి విచిత్రవీర్యుని భార్యలకు ధర్మవిధిని సంతానము కలుగున ట్లనుగ్రహింపుము!" అనెను.

అంతట నావ్యాసుని దయవలన నంబికకు ధృతరాష్ట్రుఁడును; నంబాలికకుఁ బాండురాజును బుట్టిరి.

అంబిక యొక్క దాసికిఁ గూడ విదురుఁ డను వాఁ డొకఁడు జనించెను.

ధృతరాష్ట్రుఁడు పెద్దవాఁడు కాఁగానే భీష్ముఁ డాతనికి రాజ్య మిచ్చెను; పాండురాజును యువరాజుగాఁ జేసెను.

మఱియు ధృతరాష్ట్రునకు గాంధారిని, పాండురాజునకుఁ గుంతీ మాద్రులను నిరువురు కన్యలను వివాహము చేసెను.

ధృతరాష్ట్రుని పుత్రు లగు దుర్యోధనాదులను ధార్తరాష్ట్రులనియుఁ గౌరవులనియు నందురు.

పాండురాజునకు ధర్మరాజాదు లేవురు పుత్రులు పుట్టిరి. వారనే పాండవులందురు.

పాండురాజు మృతినందఁగాఁ బెదతండ్రి యగు ధృతరాష్ట్రుఁడే యా పాండవులను బెంచెను.

కౌరవులును బాండవులును గూడ ద్రోణాచార్యుల కడనే సకలశస్త్రాస్త్రముల నభ్యసించిరి.

ఒక తల్లికిఁ బుట్టిన పుత్రులు పదుగురును బది విధములుగా నుండునపు డొక వంశమునఁ బుట్టిన వారల చిత్త మొక విధముగా నుండునా!

పాండవులు ధర్మాసక్తులు. అందుచే జనులు వారల నెక్కుడుగాఁ బ్రేమించుచుండిరి. ఆ కారణమునఁ గౌరవులకుఁ బాండవులపై నసూయ జనించినది. కావున వారలను బలు వెతలపాలు చేసిరి.

దుర్యోధనుఁడు మాయ ద్యూతము నొక దానిని గల్పించి యాపాండవుల రాజ్యలక్ష్మిని హరించెను. అంతటితోఁ బోలేదు నిండు కొలువులోఁ బాండవ ధర్మపత్నిని బాంచాలిని గట్టు పుట్టములూడ్చి కంపింపఁ జేసిరి. ఎట్లయిన నేమి! దుర్ద్యూతపరుఁడగు దుర్యోధనుఁడు పాండవులను మాయ చేసి పండ్రెండేండ్లు వనవాసమును నొక వత్సర మజ్ఞాతవాసమును జేయఁ బంపెను.

వార లట్లుచేసి వచ్చి తమ యర్ధరాజ్యమును దమ కిమ్మని గోరిరి.

అట్లు చెప్పుటకు శ్రీకృష్ణుని రాయబారిగాఁబంపిరి.

ఆ మహానీయుఁడు కౌరవులకుఁ జెప్పవలసిన విధముగాఁ జెప్పఁదగి నన్ని మాటలు చెప్పెను; కాని సంధి కుదుర లేదు. అందుచేఁ బాండవులు కౌరవులతోడఁ గయ్యమునకుఁ గాలుదువ్వవలసిన వారలైరి.

భీష్మునకుఁ గౌరవుల యెడ నున్న వాత్సల్యమే పాండవుల యెడను గలదు; కాని పాండవులు ధర్మపరాయణులగుటవలన వారలయెడ నాయనకు వాత్సల్యము కొంచె మధికముగా నుండెను.

లోకమునందును ధర్మసంధుల యెడనే ప్రజకుఁ బ్రేమ ముండును గదా!

ఆ యుద్ధమునందు దుర్యోధనుఁడు 'భీష్ముని దండ నాయకునిగా నుండు' మని కోరుకొనెను.

అప్పుడా భీష్ముఁడు దుర్యోధనునితో "ఓ కుమారా! నీవు కోరుకొనినట్లుగా వాహినీపతిత్వము వహించెదను; కాని యుద్ధమున నర్జునుని మాఱుకొనఁజాలను. అతఁ డస్త్ర విద్యయందు నాకంటెను ఘనుఁడు.

మఱియు నెందఱినైనను బరిమార్పఁ జేతులాడును; గాని పాండవులను మాత్రము పరిమాఱుప నా చేతు లెంత మాత్రము నాడవు.

అన్నిటికంటెను ముఖ్యముగాఁ దెలుపవలసిన విషయ మొకటి మిగిలి యే యున్నది:—పూర్వము నాచే నిరసింపఁ బడిన కాశీరాజపుత్రి యైన యంబ నన్నే యుపాయముచేత నైనను సాధింపవలయు నని యెంచి ఘోరతపము కావించి యీ జన్మమున ద్రుపదునకు శిఖండియై పుట్టినది. ఆహా! బ్రహ్మచర్యము సక్రమముగా నడపుకొను మహానీయులకు సకలవృత్తాంతమును గోచరించును గదా! ఆ శిఖండి యను ద్రుపదపుత్రునితో మాత్రము యుద్ధమునకు సంసిద్ధుఁడను గాను. అతఁ డెట్టి శరములను విడచిన నూరకుందును" అని మాత్రము చెప్పెను.

అంతట యుద్ధము సిద్ధమైనది.

భీష్ముఁడు సర్వసైన్యాధిపత్యమును వహించెను. యుద్ధ

రంగమునకు విచ్చేసెను. తన యోధులతో "ఓ శూరులారా! క్షత్రియులకు యుద్ధమే క్రీడాస్థానము! అది వారలకు తెఱవఁబడియున్న స్వర్గద్వారము. మన పూర్వు లందఱును రణరంగమునఁ గ్రీడించి యే పేరు వడసిరి. మనమును నిప్పుడు వారి త్రోవనే త్రొక్కవలయును" అని ప్రోత్సహించెను.

తాను బది దినములు కదనరంగమున నాట్యము చేసెను. ఆ దినములలోఁ బాండవులకు జయ మనునది కల లోని వార్త యయ్యెను. అర్జునునకుఁ బౌరుష మెక్కించుటకై శ్రీకృష్ణుఁడు "ఓ! అర్జునా! ఇదిగో! చూడుము! ఈ చక్రముతో నా భీష్మునిని తెగటార్చెదను" అని రథము పై నుండి దుమికెను.

అప్పు డేమి జరిగి యుండునో మన మనస్సును గొంచెముగా నట్లు త్రిప్పి యాలోచింపవలసి యున్నది.

అప్పుడు తన్ను జంపెద నని చక్రమును జేఁబూని వచ్చుచుండిన కృష్ణుని గాంచి "ఓ నందనందనా! ముకుందా! ధర్మమును గాపాడి నీవు పాండవుల పక్షమును బట్టితివి! నిన్ను డీకొనువాఁ డీ ముల్లోకములందును లేఁడు. ఇదే భీష్మునిని జంపెద నని వచ్చి నంతమాత్రమున నేను వెఱచెద నను కొంటివి కాఁబోలును! నే నెంత మాత్రమును వెన్నిచ్చువాఁడను గాను. నీచేఁ జచ్చుట కంటెను నాకు వేఱొండు పుణ్యము కలదే! ఓ కృష్ణా! రమ్ము! రమ్ము! శీఘ్రముగా నీ చక్ర

మున నా శిరమును ద్రుంపుము! మోక్షము నొసంగుము!" అనెను.

ఆ మాటలకుఁ బరవశుఁడు కాక భక్తపాలకుఁ డగు శ్రీహరికి భక్తవర్యుఁ డగు భీష్ముని దునుమఁ జేతు లెట్లాడఁ గలవు!

దానిని బట్టి భీష్మునకు శ్రీకృష్ణునిపైఁ గల భక్తి యపారమైన దని యూహింపఁ గలము.

భీష్ముఁ డట్లు యుద్ధము చేయు చున్నంత కాలమును దమ కెంతి మాత్రమును జయము సిద్ధింప దని యెంచి యొక నాఁటి యర్ధరాత్రమునందు ధర్మరాజు భీష్ముని చెంతకు రహస్యముగాఁబోయి ప్రణమిల్లి దీనవదనుఁడై నిలఁబడియుండెను.

ఆనదీనందనుఁడు పాండవాగ్రజుని గాంచెను; నడికి రేయి నిట్లు వచ్చుటకుఁ గారణ మేమని ప్రశ్నించెను.

అప్పుడు ధర్మరాజు భీష్మునితో "పితామహా! మా సేన నష్టముగాకుండ మాకు రాజ్యము లభించెడి దారిని జూపవలయును" అని వేఁడికొనెను.

ఆ భీష్ముఁడు ధర్మరాజుతో "ఓ ధర్మనందనా! నేను యుద్ధభూమిలోఁ గాలిడి యున్నంత వఱకు మీకు జయము కలుగఁ జాలదు" అనెను.

ఆమాటకు ధర్మరాజు "పితామహా! నిన్ను మారోర్చునఁ

దగిన మగఁ డెవ్వఁడు? నీ కరుణను గాంచ వచ్చిన నన్నుఁ
గటాక్షింపుము!" అని పాదములపైఁ బడెను.

అప్పుడు కఠినచిత్తుల చిత్తమే కరఁగును గదా! విశుద్ధ
చరిత్రుఁడును ధర్మపక్షపాతియు నగు భీష్ముని మనసు కరఁగ
కుండె నని యెవ రనఁ గలరు?

అంతట నా మహానీయుఁడు ధర్మపుత్త్రునితో "పాండ
వాగ్రజా! ధర్మపరాయణుఁడ వగు నీ ప్రార్థనను ద్రోసివేయఁ
జాలకున్నాఁడను. మీకు జయము కలుగుటకై యొక యుపా
యమును జెప్పెదను:—నేను బాణము పట్టని వానితోడను,
అంగనాపూర్వునితోడను, అంగనాభిధానునితోడ నయుద్ధము
చేయను. కావున నర్జునుఁడు ద్రుపదుని పుత్త్రుఁ డగు శిఖండిని
ముం దిడుకొని వచ్చిన నన్నోడింపఁ గలుగును" అని
చెప్పెను.

ఆహా! పరోపకారమునకై ప్రాణములను విడుచుటకు
సిద్ధపడిన పురుషుఁ డుండునా!

ధర్మపరు లగు ధర్మరాజాదులకై ప్రాణములను
గోల్పోవనుండిన భీష్ముఁ డెట్టి మహానీయుఁ డన వచ్చును.

అంత ధర్మరాజు భీష్మునిచే ననుజ్ఞాతుఁడై శిబిరము
నకుఁ జని జరిగిన వృత్తాంత మెల్లను వాసుదేవునకును దమ్ము
లకును దెలిపెను.

అర్జునుఁ డా విధముగా జగదేకవీరుని భీష్ముని జంప

వలసి వచ్చినాదుల కొంతయో చింతిల్లెను; కాని తుద కట్లు చేయుట తప్పినది కాదు. శిఖండిని ముం దిడుకొని పోయి భీష్మని నర్జునుఁడు వివిధ బాణములతోడఁ గొట్టెను.

ఆ భీష్ముఁడు నేలఁగూలక యా బాణములనే యూఁతఁగాఁ జేసికొని వానిపైఁ బాదుకొని యుండెను.

అప్పుడు కౌరవులును పాండవులును గూడ యుద్ధమును నిలిపివైచి యా మహానీయుని చెంతకు వచ్చిరి.

అట్లు శరశయ్యపైఁ బడియున్న గంగాపుత్రుఁడు వాంఛింపఁగా నర్జునుఁడు తన నేర్పుతో బాణముల నుపధానముగా నుండునట్లు వేసెను.

అంత భీష్ముఁడు తన దాపున నున్న వారలతో "నేనుత్తరాయణము వచ్చుదనుకను నిందే యుండుకొని యుండెదను. అంతవఱకును మీ రెల్లరును నన్నుఁ జూచుచుండవలయును" అనెను.

ఆ గంగాతనయునకు శ్రీకృష్ణుని యెడఁ గల భక్తి వర్ణనాతీతమైనది. అందుచే వాసుదేవుని చిత్తమునఁ జేర్చి నిర్యాణకాలమునకై నిరీక్షించు చుండెను.

ఆ భీష్ముఁడు శ్రీకృష్ణుని శాసనమును బట్టి యుత్తరాయణము వచ్చువఱకు ధర్మనందనునకు వివిధ ధర్మముల నుపదేశించెను.

ఆ కృతపుణ్యుఁ డుత్తరాయణమునందుఁ దా నను

కొనిన మాఘ శుక్లైకాదశి తిథి రాఁగా ముకుందుని యిట్లు వేఁడికొనెను:—

"తే. దేవదేవ జీవాత్మక ǀ దేవవంద్య
శంఖ చక్ర గదా పద్మ ǀ చారుహస్త
వాసుదేవ త్రివిక్రమ ǀ వరద పరమ
పురుష ప్రణతి యొనర్చెదఁ ǀ గరుణఁ జూడు!

ఆ. బలము నీవ నాకు ǀ భక్తుఁడ నీయెడ,
బాలు బిడ్డఁ జేసి ǀ యట్టివాఁడఁ
గావు నన్ను నధిక ǀ కారుణ్యమున నిమ్మ
నుజ్ఞఁ గమలదళ ǀ మ నోజ్ఞ నయన!"

అని వేఁడికొని శ్రీకృష్ణు నాజ్ఞను బడసి పరమానందముతో ధర్మరాజాదులకుఁ జెప్పవలసిన మాటలు చెప్పిన పిదప నా యాత్మము బ్రహ్మరంధ్రమును భేదించుకొనిపోయి దివ్యతేజమును జేరెను.

:: ప్రకాశము ::

"చిత్తమునకు వికారమును గలిగించెడి కారణము లెన్ని యున్నను వానిని లెక్కచేయక బ్రహ్మచర్యాదివ్రతములతో నుండు వాఁడే ప్రపంచ మందలి యేకార్యము నైనను జేయఁ జాలినవాఁడు. అతఁడే సత్యసంధుఁ డగును. అతఁడే పితృ మాతృ భక్తిపరాయణుఁ డగును. అతఁడే యనుచితకార్య

ములను జేయఁ దన్నెట్టివారలు ప్రోత్సహించినను జేయఁ జూడఁడు. అతఁడే మృత్యువును గూడ స్వవశమును జేసి కొనఁగలఁడు”

—( ఆఱవ దీపము )—

## దుర్యోధనుఁడు—ధృతరాష్ట్రుఁడు

పాండవులు మాయద్యూతమునందు సకల సంపదలను బోఁగొట్టుకొని యరణ్యమునకుఁ బోయినను మంచి నడవడిక గలవా రగుటచే నందును సుఖముగా జీవించు చుండిరి.

అట్లుండుటయుఁ గూడ దుశ్శీలుఁ డగు దుర్యోధనునకు దుఃఖమునకుఁ గారణ మయ్యెను.

అందుచే నాతఁడు రేయియును బవలును గూడ విచారములో నుండెడివాఁడు.

ఆ సమాచారము తండ్రి యగు ధృతరాష్ట్రుఁడు విని యొక నాఁడు తన పుత్రునిఁ జేరఁ బిలిచి “నాయనా! దుర్యోధనా! నీ వెప్పుడు చూచినను విచారముతోఁ గూడి యున్నట్లే యగపడుచున్నావు. అందులకుఁ గారణ మేమై యుండును! మనకు ద్రవ్యమునకా లోటు లేదు. కావలసినంత ద్రవ్య మున్నది. వస్తువాహనములకా లోప మెంత

మాత్రమును గానరాదు! మనము జూడ సకలైశ్వర్యము
లతోఁ దులఁదూఁగు చున్నారము! ఇంక నీ కా విచార
మెందులకు!" అని ప్రశ్నించెను.

ఆ దుర్యోధనుఁడు పాండవుల భాగ్యమును జూడఁ
జాలనివాఁ డని లోకమునకును దెలిసిన విషయ మే కదా!

అందుచేఁ దండ్రితో "తండ్రీ! మన చుట్టము లంద
ఱును నెచ్చటనో యడవియం దున్న ధర్మరాజాదుల చెంత
కుఁ జేరి వారిని గొలుచుచున్నారు. ఇంక బ్రాహ్మణు లన్ననో
వేలకొలఁదిని జేరి వేవిధముల వారిని వినుతు లొనర్చు
చున్నారు. మన మా పాండవులను నిర్ధనులనుగఁ జేసి విపి
నములకు వెడలఁబుచ్చినను బంధువర్గముతోఁ గూడి సదా
బంగరు పళ్లెరములందే భుజించుచున్నారు" అని తన యసూయ
నంతయును జనకునితోఁ జెప్పుకొనెను.

ఆ ధృతరాష్ట్రుఁడు తన తనయుని విధమునఁ బరుల
సంపదలను జూచి యోర్వలేనివాఁడు కాఁడు; కావున సుతుఁ
డసూయాగ్రస్తుఁ డగుట కెంతయో వగచెను.

పుత్రులు ధర్మమార్గమును విడనాడి చరించునపుడు
తండ్రులు వారలను సుపథమునకు ద్రిప్పఁ జూచుటయే
యోగ్య మైన పని. ఆ కారణమున దుర్యోధనునితో
"నాయనా! నేను పూర్వ మింద్ర ప్రహ్లాదుల కథను వింటిని.
దానినే నీ కిప్పుడు చెప్పుచున్నాఁడను:—ప్రహ్లాదుఁడు దైత్య

కులోద్భవుఁ డయ్యును దన సుశీలము వలన నే స్వర్గ రాజ్యము ననుభవించెను. విబుధులచేఁ బ్రస్తుతింపఁబడెను. ఉత్తమ గుణములు లేని వారల కున్నతపదవులు కలుగఁజాలవు; ఒక వేళ కలిగిన నవి దీర్ఘకాలము నిలువవు.

దేవేంద్రున కా సంగతి బాగుగాఁ దెలియును గావున "నేను ప్రహ్లాదునకు శిష్యుఁడనై యాయన కడ నున్న మంచి గుణములను నేర్చుకొందును" అనుకొనెను.

అంత నా దేవేంద్రుఁ డేమిచేసెనో యెఱుఁగుదురా?

ఒక బ్రాహ్మణవేషధారి యై ప్రహ్లాదుని దగ్గఱకుఁ బోయి యిట్లనియెను:—

బ్రాహ్మణుఁడు:—మహారాజా! ఉత్తమోత్తమ మగు జ్ఞానమును నా కుపదేశింపుము!

ప్రహ్లాదుఁడు:—ఓ విప్రుఁడా! నీ కిష్టమైనట్టి జ్ఞానమును బోధింప నా కవకాశము లేదు.

బ్రాహ్మణుఁడు:—మహాప్రభూ! తమ కిష్ట మెంత మాత్రమును దీఱిక లేకయున్న పక్షమునకుఁ దీఱిక కలుగు నంత వఱకును నిందే యుండి తమకు సేవ చేయుచుందును.

పూర్వకాలమునందుఁ దుద కొక వత్సర మైనను విద్యార్థుల గుణములను బరీక్షించినఁ గాని గురువులు వార లకు శాస్త్రములను జెప్పెడి వారలు కారు.

అందుచేత నొక సంవత్సరము వఱకును నతి భక్తిశ్రద్ధ

లతో గురుసేవ కావించిన బ్రాహ్మణునితో నొకనాఁడు ప్రహ్లాదుఁ డిటనియె:—

ప్రహ్లాదుఁడు:—శిష్యుఁడా! నీ సేవ నా కెంతయును సంతోషమును గూర్చుచున్నది. నీ వేమి కోరి యిచ్చుటకు వచ్చితివో చెప్పుము!

బ్రాహ్మణుఁడు:—మీ శీలమును నా కనుగ్రహింప వలయును. ముఖ్యముగా మనుజునకుఁ గావలసిన దంత కంటె వేఱొకటి యుండదు.

ఆ బ్రాహ్మణుఁ డనిన యా మాటకుఁ బ్రహ్లాదుఁ డాశ్చర్యపడుచు మరల నిట్లనియెను:—

ప్రహ్లాదుఁడు:—అట్లే! నీ కది తప్పక బోధించెదను. అని వెంటనే తన దేహమునుండి చంద్రునితో సాటి యగు నొక కాంతిని వెలిపుచ్చెను; ఆ కాంతి రూపుదాల్చి నిలచెను. ఆమెను నీ వెవ్వతెవు? అని ప్రహ్లాదుఁడు ప్రశ్నించెను. దాని కామె "నేను నీ శీలమునే కదా! మీరు వదల్చి విప్రున కొసఁగుటచే నాతనిచెంతకుఁ బోవుచున్నదానను" అని యింద్రునిని జేరెను.

తర్వాత నట్లే మఱి యొక కాంతి ప్రహ్లాదుని శరీరము నుండి వెలికివచ్చి మూర్తిమతియై నిలచెను. అప్పుడా ప్రభను 'నీ వెవ్వతెవు?' అని ప్రహ్లాదుఁడు ప్రశ్నించెను. అందుల కామె నేను ధర్మ మను దానను; శీల మెందుండునో నేనును

నందే యుందును; అది యెక్కడకుఁ బోవునో నేను గూడను నక్కడికే పోదును” అని చెప్పి యామె యా బ్రాహ్మణుని యందుఁ బ్రవేశించినది.

అంతట మఱియొక కాంతి యా ప్రహ్లాదుని కాయము నుండి వెలికి వచ్చి రూపవతియై నిలిచి యుండెను. దానిని గాంచి ప్రహ్లాదుఁడు “నీ వెవతెవు?” అని ప్రశ్నించెను. అందుల కామె “నేను సత్య మను దానను; నేను సదా ధర్మముతోడనే యుందును; ఆ ధర్మ మెచ్చటికిఁ బోవునో నేనును నచ్చటికే పోదును” అని ప్రత్యుత్తర మిచ్చి యా బ్రాహ్మణునిఁ జేరెను.

అంతట మఱియొక కాంతియు నట్లె రూపమును దాల్చి నిలఁబడియుండెను. అప్పుడు ప్రహ్లాదుఁడు ‘నీ వెవతెవు?’ అని ప్రశ్నించెను.

అందుల కామె “నేను వ్రతము (ధృఢనియమము) అను దానను. సత్య మెక్కడనుండునో నేనును నక్కడనే యుందును; సత్య మెచ్చటికిఁ బోవునో నేనును దానిని వెంబడించెదను” అని ప్రత్యుత్తర మిచ్చి యాబ్రాహ్మణునిఁ జేరెను.

తరువాత మఱియొక ప్రభ యాఁ బ్రహ్లాదుని శరీరము నుండి వెలికివచ్చి రూపుదాల్చి నిలిచియుండెను. దానిని గాంచి ప్రహ్లాదుఁడు ‘నీ వెవ్వ తెవు?’ అని యడిగెను.

దాని కామె “నేను బల మను దానను. వ్రత మెచ్చట

వసించునో నేనును నచ్చటనే వసించుదానను; అది యెక్క-
డికిఁ బోయిన నేనును నక్కడికే పోవుచుందును" అని చెప్పి
యా బ్రాహ్మణునిని జేరెను.

కడపట నొక దివ్యకాంతి యా ప్రహ్లాదుని తనువునుండి
వెలికివచ్చి రూపముదాల్చి నిలఁబడియుండెను. అంత నాతఁడు
'నీ వెవ్వతెవు?' అని యడిగెను.

అంగాల కామె నేను శ్రీ (లక్ష్మి) యను దానను;
బల ముండుతావునే నేను నుందును; బలము పోయినచోటికే
నేనును బోవుచుందును" అని యా బ్రాహ్మణునిని జేరెను.

అంతట బ్రాహ్మణవేషధారి యగు నింద్రుఁడు ముల్లోక
ములను జయింపఁగలిగెను.

ధర్మముకాని సత్యముకాని వ్రతముకాని బలముకాని
శ్రీకాని శీలముపై నాధారపడియుండును; కావున శీలము
కలవాఁడవు కమ్ము!" అనెను.

తండ్రి చెప్పిన యాకథను విని దుర్యోధనుఁడు మరలఁ
దండ్రిని "నాయనా! శీల మన నేమి!" అని ప్రశ్నించెను.

ఆ మాటకు ధృతరాష్ట్రుఁడు "ఓ దుర్యోధనా! శీలమన
నేమియో యనుకొనుచున్నాఁడవు. మనస్సుచేతను గాని
వాక్కు-చేతను గాని కర్మముచేతను గాని యే ప్రాణికిని
ద్రోహము చేయక యుపకారమునే చేయుచుండుటకు శీల మని
పేరు. దానికే సత్స్వభావమనియు సద్వృత్తమనియుఁ బేర్లు

కలవు. సద్వృత్తము (మంచినడత) లేని వాని కెన్నఁడును సంపద సంప్రాప్తము కాదు. ఒకవేళ వానికి ము న్నొనర్చిన కర్మమును బట్టి కలిగిన సత్ఫలమునం దది యచిరకాలముననే యడుగంటి పోవును" అని చెప్పెను.

బాలకులారా! కౌరవులు చెడిపోవుటకును, పాండవులు బాగుపడుటకును గారణ మేమైయుండునో మీ రూహింపఁగలరా!

ఆ దుర్యోధనాదు లట్టి శీలము లేని వారగుటచేతనే నశించిరి; శీలవంతులగు ధర్మరాజాదు లాపదల కేఁగినను సంపద వెంటనంటియే యున్నది.

—: ప్రకాశము :—

"శీలము లేక ధర్మమును, ధర్మము లేక సత్యమును, సత్యము లేక వ్రతమును, వ్రతము లేక బలమును, బలము లేక లక్ష్మియు నుండవు; కావున సద్వృత్తముతో నుండవలయును. ఆ సద్వృత్తమైనను జిన్నతనమునందే యలవడవలయును గాని పెద్దతనమునం దలవడదు. కావున సర్వులునకును మూలమగు మంచి నడవడికను బాల్యముననే యలవఱుచు కొనవలయును"



